# నివేదన

అనాదిగా మానవుడు జీవితగమ్యాన్నిగూర్చిన అన్వేషణను చేస్తూనే ఉన్నాడు. **"కస్త్వం కోహం, కుతో జాతా ఇయం సృష్టిః"** (నీవెవరు? నేనెవడను? ఈ సృష్టి ఎక్కడ నుండి వచ్చింది?) మొదలైన ప్రశ్నలు అతన మనస్సులో మెదులుతూనే ఉన్నాయి. కంటికి కన్పించే భౌతికప్రపంచం నశ్వరమనే విషయాన్ని, ఈ సమస్తజగత్తును, ఏకతాటిపై నడిపించే అద్భుతశక్తి ఒకటి తప్పక ఉండి ఉండాలనే వాస్తవాన్ని మహర్షులు ముందుగానే గుర్తించారు. అయితే, **"ఏకం సత్ విప్రాః బహుధా వదంతి"** అని, **"మహామతీనాం మతయశ్చ భిన్నాః"** అనే రీతిలో ఈ అద్భుతమైన జగత్తును పాలించే అదృశ్యదైవాన్ని గూర్చిన స్వరూపస్వభావాల విషయంలోమాత్రం భిన్నభిన్న భావాలు వారి వారి దృక్కోణాలకు అనుగుణంగా ప్రతిపాదింపబడ్డాయి. అటువంటి వైదిక సిద్ధాంతాలలో ఒకటి – వేదాలను అన్నిటిని సమగ్రంగా, సయుక్తికంగా సమన్వయించే విశిష్టాద్వైతసిద్ధాంతం. ఈ సిద్ధాంతంలో చిదచిదీశ్వర తత్త్వాలు మూడు అంగీకరింప బడ్డాయి. ఈశ్వరతత్త్వం – సగుణుడు, సాకారుడు, విభూతిద్వయ, యుక్తుడు, దివ్య లీలాశోభితుడు, పరవ్యూహాది పంచప్రకారాలను కలవాడైన, లక్ష్మీసహితుడైన నారాయణుడే. వైకుంఠంలోని నిత్యసూరిపరిషన్నిషేవ్యమాణుడైన శ్రీమన్నారాయణుని సాన్నిధ్యాన్ని చేరి, ఆ స్వామికి సర్వకాల సర్వావస్థోచిత సకలకైంకర్యాలను చేయడమే పరమపురుషార్థం. ఇటువంటి పురుషార్థాన్ని పొందడానికి కర్మ – జ్ఞాన – భక్తి యోగాలనే ఉపాయాంతరాలు చెప్పబడినా, వీటి అన్నిటికంటే పరమాత్మకు అభిమతమైనది, జీవుని స్వరూపానికి తగినది శరణాగతియే. "స్వామీ! వేఱు ఏ గతి లేనివాడనై నేను నిన్ను ఉపాయంగా పొందుతున్నాను. నా రక్షణభారం నాదే, నాది కాదు" అనే మానసికమైన, అచంచలమైన విశ్వాసంతో కూడిన, ప్రార్థనయే శరణాగతి. దీనిని వేదంకూడా **"తస్మాన్న్యాసమేషాం తపసామతిరిక్తమాహుః"** అని ఉత్తమమోక్షోపాయంగా నిశ్చయించి పల్కింది. ఈ శరణాగతియొక్క స్వరూపస్వభావాలను అందంగా వివరించి చెప్పే మధురస్తుతులలో ఒకటి ఈ శరణాగద్యం.

విశిష్టాద్వైతసిద్ధాంతప్రచారకాగ్రేసరులైన భగవద్రామానుజులు రచించిన తొమ్మిది గ్రంథాలలో శరణాగతి గద్యం ఒకటి. శ్రీరామానుజులు, శ్రీరంగనాయకి శ్రీరంగనాథుల సమక్షంలో ఒక పంగునిమాసం ఉత్తరానక్షత్రంనాడు (లక్ష్మీజయంతి నాడు) ఆ దివ్యదంపతులను శరణాగతి చేసి, తాము చేసిన ఆ శరణాగతిప్రకారాన్ని

అస్తికులంతా తెలిసి, ఆచరించి, భగవదనుగ్రహాన్ని పొంది ఉత్తమపురుషార్థాన్ని పొందాలనే ఔదార్యంతో ఈ శరణాగతి గద్యను మనోహరమైన శైలిలో రచించి, లోకానికి ఇచ్చారు. ఈ స్తుతిలోని శైలి ఎటువంటివారి హృదయాన్ని అయినా కదిలించగల్గినది, కఠినగించగల్గినది. స్తోత్రవాఙ్మయంలోనే తలమానికమైనది. దీనిని శ్రుతప్రకాశికాభట్టర్, పెరియవాచ్చాన్‌పిళ్ళై, వేదాంతదేశికులు మొదలైన పూర్వాచార్యులు పలువురు వ్యాఖ్యానించారు.





భగవద్రామానుజ ప్రణీతమైన

# శరణాగతి గద్యం

## ( వివరణంతో )

యతినాథవైద్యదత్తం శరణాగతిగద్యరూపజీవాతుమ్ ।
సంసారరోగభీతాః! సేవస్వేనం సభక్తికం నిత్యమ్ ॥



వన్దే వేదాన్తకర్పూర చామీకరకరణ్డకమ్ ।
రామానుజార్య మార్యాణాం చూడామణి మహర్నిశమ్ ॥

వేదాంత శాస్త్రమనే పచ్చకర్పూరాన్ని సురక్షితంగా, పరిమళం మాఱని విధంగా కాపాడే బంగారుబరిణె - అనే రీతిలో వేదాంత మార్గప్రతిష్ఠాపనాచార్యులై, ఆశ్రితులకు అందఱికి శిరోరత్నమై వెలిగే శ్రీరామానుజులను నిత్యం నమస్కరిస్తున్నాను.

**"చామీకర"**మంటే బంగారం. **"కరండక"**మంటే బరిణెవంటి ఒక పాత్ర. శ్రీ రామానుజులు **వేదాంతవిద్యానిధి** - అనేది శ్లోకంలోని పరమతాత్పర్యం. **"సర్వ గంధః"** అని శ్రుతులలో కీర్తింపబడే భగవానుని వేదాంతాలు వహిస్తున్నందున (తెలుపుతున్నందున) అవి ఇక్కడ పచ్చకర్పూరంగా రూపింపబడ్డాయి.

## ఉపోద్ఘాతం

శాస్త్రాలలో కర్మయోగమని, జ్ఞానయోగమని, భక్తియోగమని, ప్రపత్తి యోగమని- ఈ రీతిలో మోక్షోపాయాలు అనేకంగా విధింపబడ్డాయి. భగవద్రామానుజులు అన్యమతాలను నిరసించడంకోసం శ్రీభాష్యాన్ని రచించారు కనుక, ఆచార్యపరంపరారుచిపరిగృహీతమైన ప్రపత్తిని శ్రీభాష్యంలో మఱుగుపఱచి, భక్తిని మోక్షోపాయంగా వ్యక్తం చేశారు. **"తత్త్వమసి"** ఇత్యాది వాక్యజన్యజ్ఞానమే మోక్షసాధనమని, కర్మజ్ఞానసముచ్చయమే మోక్షసాధనమని చెప్పే అన్యవాదులను నిరసించడంకోసం కర్మాంగమై, వేదన-ధ్యాన- ఉపాసనాదిశబ్దాలతో వ్యవహరింపబడేదై, భక్తిరూపాపన్నమైన జ్ఞానవిశేషమే వేదాంతాభిమతమైన మోక్షసాధనమని అందులో తెలుపవలసివచ్చింది.

అయినా, శ్రీరామానుజులు, తమకు అభిమతమైన, తమచే పరిగృహీతమైన అర్థాన్ని విశ్వసించే సాత్త్వికులకు తమ అభిప్రాయాన్ని విశదతమంగా వ్యక్తం చేయాలని తలచి, ఆచార్యరుచిపరిగృహీతం, తమకు రక్షకంగా తాము నిశ్చయించు కొనిన మోక్షోపాయం ప్రపత్తియే- అనే విషయాన్ని ఈ శరణాగతిగద్యం ద్వారా వెల్లడిచేశారు.

శ్రీభాష్యంలో ప్రపత్తిని వ్యక్తం చేయడంద్వారా అన్యవాదులను నిరసించ కూడదా? అని అంటే, దానికి ఆచ్చాన్‌పిళ్ళై అనే ఆచార్యులు అనుగ్రహించిన సమాధానం ఏమంటే- వేదాన్ని అధ్యయనం చేయదగిన అర్హతను లేనివారికి దానిని ఉపదేశించడం తగనిది అయినట్లే, యోగ్యత లేనివారికి పరమరహస్యమైన ఈ అర్థాన్ని వ్యక్తం చేయకూడదు- అని తలచి వారికి తెలిసిన శాస్త్రంద్వారానే వారిని నిరసించి, శాస్త్రతాత్పర్యమైన తమ సిద్ధాంతాన్ని ఈ శరణాగతిగద్యద్వారా వ్యక్తం చేశారు అని.

భక్తికంటే ప్రపత్తి చాలా గొప్పది. ఏవిధంగా? అంటే, భక్తి అనేది అధికృతాధి కారం. (అంటే- ఒక విధమైన యోగ్యతను కలవారికి మాత్రమే ఆచరణ సాధ్యం.) కాని, ప్రపత్తి సర్వాధికారం. (దీనిని అందఱు అనుష్ఠింపవచ్చు.) భక్తి దుష్కరం. ఇది సుకరం. భక్తి ఆలస్యంగా ఫలాన్ని ఇస్తుంది. ఇది శీఘ్రంగా ఫలాన్ని కల్గిస్తుంది. భక్తిలో **"శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే"** (యోగభ్రష్టుడు పవిత్రులైన, సంపన్నులైనవారి ఇంటిలో అతడు పూర్వం చేసిన యోగసాధన ఫలంగా జన్మిస్తాడు) అనే రీతిలో ప్రమాదసంభావన ఉన్నది. ప్రపత్తిలో అటువంటి ప్రమాదానికి అవకాశం లేదు. భక్తి సాధ్యోపాయం. ప్రపత్తి సిద్ధోపాయం. అది (స్వరక్షణే స్వాన్వయ రూపమైనది కనుక) స్వరూపవిరుద్ధం. ప్రపత్తి, స్వప్రపత్తి నివృత్తి రూపమైనది కనుక, స్వరూపానికి తగినది. అది ప్రాప్యానికి అనురూప మైనది కాదు. ఇది (ప్రపత్తి) ప్రాప్యానికి అనురూపం. ఈ రీతిలోని వైలక్షణ్యాలను దృష్టిలో ఉంచుకొని శ్రీవేదాంతదేశికులు న్యాసతిలకంలో- **"ఆర్తేష్వాశుఫలా తదన్య విషయేఽప్యుచ్ఛిన్నదేహాంతరా, వహ్న్యాదే రనపేక్షణాత్ తనుభృతాం సత్యాదివత్ స్వామినీ, శ్రీరంగేశయ! యావదాత్మనియత త్వత్పారతంత్ర్యోదితా త్వయ్యేవ త్వదుపాయధీరభిహితస్వోపాయభావాఽస్తు మే"** (శ్రీరంగనాథా! సంసారంనుండి త్వరగా విముక్తి పొందాలనే తహతహను కలవారి విషయంలో వేగంగా ఫలాన్ని ఇచ్చేది, మిగిలిన దృప్తప్రపన్నుల విషయంలోకూడా దేహావసానంలో ఫలాన్ని ఇచ్చి



ఇంకొక జన్మను లేకుండా చేసేది, అగ్నికార్యాదివైదిక కర్మానుష్ఠానాన్ని అపేక్షించ నందువల్ల, "సత్యాన్ని పలకాలి'' ఇత్యాది ధర్మాలు అందఱికి వర్తించేటట్లే, జీవులకు అందఱికీ వర్తించేది, ఆత్మ ఉన్నంతవరకు నియతంగా నీకు పరతంత్రమై ఉండదగిన ఆత్మస్వభావానికి తగినది, నీ విషయంలోనే, ప్రాప్యుడవైన నీవే ఉపాయం కావాలి - అనే రూపంలోని ప్రవృత్తి, అదే ముఖ్యోపాయమనే భావాన్ని లేనిదై నాకు కలగాలి) అని అన్నారు. ఈ శ్లోకంలో ప్రపత్తికి ప్రయోగించిన విశేషణాలు అన్నీ భక్తినుండి దానిని వ్యావర్తింపజేసేవిగాకదా ఉన్నవి.

అయితే, ఈ ప్రపత్తి వేదాంతసిద్ధమేనా? - అని అంటే, ఇది వేదాంతప్రోక్తమే. ఉపనిషత్తులలో ఒకదానికంటే ఇంకొకటి మేలైనదిగా చెప్పే సందర్భంలో అన్నిటి కంటే గొప్పదిగా **"తస్మాన్న్యాస మేషాం తపసా మతిరిక్తమాహుః"** అని అంటూ తపస్సులన్నిటిలో గొప్ప తపస్సు ప్రపత్తి - అని నిర్ణయింపబడింది.

ఈ విధంగా వేదాంతసిద్ధమే కాకుండా, ధర్మజ్ఞులలో శ్రేష్ఠులైన దివ్యసూరుల, పూర్వాచార్యుల అనుష్ఠానంలోకూడా ఇదే పరిగృహీతమైనది. అందువల్ల వేదాంతసిద్ధం; స్వరూపప్రాప్తం; ఆచార్యరుచిపరిగృహీతం, శరణ్యుడైన భగవానుని హృదయానికి అభిమతమైన ప్రపత్తిని తమకు సంబంధించినవారు (స్వకీయులు) కోల్పోరాదు - అని తలచి, తమకు, శ్రీరంగనాథునకు మాత్రమే తెలిసేటట్లుగా ప్రపత్తిని ఆచరించినప్పటికీ సరిపోయినా, ఆ విధంగా కాకుండా, తమ పరమకృపతో తమ అనంతరం ఉండేవారికి అందఱికి ఉపజీవ్యంగా ఈ ప్రబంధరూపంలో శ్రీరామానుజులు వ్యక్తం చేశారు.

శరణాగతిగద్యం అనే ఈ దివ్యగ్రంథం ఏవిధంగా అవతరించింది? అని అంటే, శ్రీరంగదివ్యాలయంలో ఒక పంగునిమాసం ఉత్తరానక్షత్రంనాడు శ్రీరంగనాథుడు, పెరియ పిరాట్టియార్ (శ్రీరంగనాయకి) బయలు దేరి **"శేరియ శిఙ్గాశనమ్"** పై ఇద్దఱు కలసి వేంచేసి ఉండే సమయంలో భగవద్రామానుజులు అక్కడకు వేంచేసి, వారికి దండం సమర్పించి, నిలచారు. అపుడు మనవంటి సంసారుల భాగ్యవిశేషంచేత వారి మనస్సులో సంసారభీతి కల్గింది. అపుడు వారు శ్రీరంగనాయకీ శ్రీరంగనాయక దివ్యదంపతుల శ్రీచరణాలలో వాలి, శరణు పొంది, తాము చేసిన ఆ శరణాగతిప్రకారాన్ని ఈ ప్రబంధరూపంగా వెలయించారు.

గద్యత్రయంలోని మొదటిది అయిన ఈ శరణాగతిగద్యం మంత్రరత్నమనే ద్వయానికి వ్యాఖ్యానరూపమని మన పూర్వాచార్యుల అభిప్రాయం. ఈ విషయం

ప్రారంభంలోనే సుస్పష్టంగా కన్పిస్తున్నది. ఇందులో, పిరాట్టి, శ్రీరంగనాథుడు శ్రీరామానుజులకు సమాధానం పల్కినట్లు కన్పిస్తున్నదికదా! అది ఏమి? అర్చాసమాధిని దాటి, **"అస్తు తే, తయైవ సర్వం సంపత్స్యతే"**, **"నిత్యకింకరో భవ"**, **"ఏవం భూతోఽసి"**, **"అత్రైవ శ్రీరంగే సుఖమాస్వ"** అని నోరు తెఱచి దివ్యదంపతులు పలికారా? అని అంటే, **"అహేః పాద మహిరేవ జానాతి"** (పాము కాళ్ళనుగూర్చి పాముకే తెలుసు) అనే రీతిలో ఆ దివ్యదంపతుల మనస్సులోని అభిప్రాయాన్ని, వారి తిరుముఖమండలాన్ని గమనించి గ్రహించి శ్రీరామానుజులు ఆ రీతిలో పలికారు - అని కొందరు అంటారు. దివ్యదంపతులు నోరు తెరచి సంగ్రహంగా పల్కిన మాటలను, శ్రీరామానుజులు తరువాత ప్రబంధరూపంగా వివరించి పలికారు - అని మఱి కొందఱు అంటారు. సాక్షాత్ సంవాదమే సంభవించినట్లు శ్రీవేదాంతదేశికుల అభిప్రాయమని వారి గద్యభాష్యంలో కన్పిస్తున్నది.

మన పూర్వాచార్యుల గ్రంథాలన్నీ తత్త్వ-హిత-పురుషార్థాలను వ్యక్తం చేయడంకోసమే అవతరించినవి కనుక, ఈ దివ్యగ్రంథంకూడా అటువంటిదే. ఇందులోని సంబోధనపదాలన్నీ తత్త్వపరాలని, శరణవరణప్రతిపాదకవాక్యం హితపరమని, ప్రార్థనాప్రకాశకవాక్యాలు పురుషార్థపరాలని గ్రహించాలి.

శరణాగతిగద్యం, శ్రీరంగగద్యం, వైకుంఠగద్యం - అనే మూడు ఒకే ప్రబంధంగా వ్యవహరింపబడినా, ఒక్కొక్క గద్యం ఒక్కొక్క ప్రబంధమని పూర్వాచార్యుల అభిప్రాయం. అందువల్లనే శ్రీరామానుజులు అనుగ్రహించిన గ్రంథాలు తొమ్మిది - అని గురుపరంపరాసారంలో శ్రీదేశికులు లెక్కించారు.

---

**1. ఓమ్. భగవన్నారాయణాభిమతానురూప స్వరూపరూపగుణ విభవైశ్వర్య శీలాద్యనవధికాతిశయా ఽసఙ్ఖ్యేయ కల్యాణగుణగణాం, పద్మవనాలయాం, భగవతీం, శ్రియం, దేవీం, నిత్యానపాయినీం, నిరవద్యాం, దేవదేవ దివ్యమహిషీమ్, అఖిలజగన్మాతరమ్, అస్మన్మాతరమ్, అశరణ్యశరణ్యామ్, అనన్యశరణ శ్శరణ మహం ప్రపద్యే ॥**

**భగవన్నారాయణ** = జ్ఞానశక్తిబలైశ్వర్యాది సకలకల్యాణగుణ పరిపూర్ణుడైన నారాయణునకు, **అభిమత+అనురూప** = ఇష్టంగాను, తగినవిగాను ఉండే, **స్వరూప రూపగుణవిభవ** = స్వరూపం, విగ్రహం, విగ్రహ గుణాలు, విభూతులు - అనే



వీటిని, **ఐశ్వర్య శీల+ఆది** = ఐశ్వర్యం, సౌశీల్యంమొదలైన, **అనవధిక+అతిశయ**= ఎల్ల లేని గొప్పతనాన్ని కల, **అసంఖ్యేయ** = లెక్కలేనన్ని, **కల్యాణగుణగణామ్** = కల్యాణగుణసమూహాలను కల్గినది, **పద్మవన + ఆలయామ్** = కమలవనాన్ని వాసస్థానంగా కల్గినది, **దేవీం** = గొప్ప కాంతితో నిండిన రూపాన్ని కల్గినది, **నిత్య+అనపాయినీం** = (భగవానుని) ఏనాడూ విడిచిపెట్టి ఉండనిది, **నిరవద్యాం**= పరిశుద్ధిని కల్గినది, **దేవదేవదివ్యహిషీం** = దేవాధిదేవుడైన భగవానుని దివ్యమహిషి, **అఖిలజగత్+మాతరం** = అన్ని లోకాలకు తల్లి, **అస్మత్+మాతరం** = (విశేషించి) మాకు తల్లి, **అశరణ్యశరణ్యాం** = ఏ దిక్కు లేనివారి గొప్ప దిక్కు అయిన, **శ్రియం** = లక్ష్మిని, **అనన్యశరణః అహం** = వేఱు గతి లేనివాడనైన నేను, **శరణం ప్రపద్యే** = శరణు పొందుతున్నాను.

**వివరణం :-** ఈ చూర్ణికద్వారా శ్రీరామానుజులు మొట్టమొదటగా లక్ష్మీదేవిని ఆమె పురుషకారకోసం శరణు పొందుతున్నారు. ముందు తాము శ్రీరంగనాథుని శ్రీచరణసన్నిధిలో వ్యక్తం చేయబోయే శరణాగతినిష్ఠకు ఉపేయరుచి, ఉపాయాధ్యవసాయం పరిపక్వమై ఉండాలి కనుక, అవి ఏకొఱత లేకుండా సిద్ధించాలని పిరాట్టిశ్రీచరణాలలో శరణు వేడుతున్నారు. లోకంలో ఏది సిద్ధించవలసి ఉన్నా, లక్ష్మీదేవి అనుగ్రహంవల్లనే సిద్ధించాలనే నమ్మకం కలవారికి ఇది ప్రాప్యమే. ఇరామానుశ నూఱ్ఱన్దాది ప్రబంధంలోని చివరి పాశురం ఇక్కడ తగిన ఉదాహరణంగా అనుసంధేయం. ఆ పాశురంలో - **"పఙ్గయమామలర్ ప్పావైయై ప్పోఱ్ఱుదుమ్"** (పంకజపుష్పవాసినిని కీర్తించడం) అని అంటూ లక్ష్మీదేవిని ప్రార్థించాలని పల్కడం భగవద్రామానుజుల శ్రీచరణపద్మాలు తమ శిరస్సుపై పొందికగా నిలచి ఉండడం కోసమేకదా. **"పొఙ్గియ కీర్త్తి ఇరామానుశనడిప్పూ నమ్ తలైమిశైయే మన్నవే"** (పొంగే కీర్తిని కల శ్రీరామానుజుల పాదపద్మాలు మన శిరస్సుపై మన్నికగా ఉండడం కోసమే) అని అముదనార్ అన్నారు కదా!

**"భగవన్నారాయణాభిమత"** ఇత్యాదివిశేషణంతో లక్ష్మీదేవియొక్క స్వరూపరూప విభవగుణాదులు అన్నీ భగవానుని మనస్సుకు చాలా అభిమతంగాను (ఇష్టంగాను), తగినవిగాను ఉన్నాయి- అని తెలుపబడింది. లోకంలో కొందఱి స్త్రీల రూపగుణాదులు వారి పురుషులకు క్రమాన్నిబట్టి (భర్తృ భార్యా క్రమాన్నిబట్టి) ప్రాప్తాలు అయినా, వారి భర్తల మనస్సుకు అభిమతాలు కాకుండా ఉంటాయి. మఱి కొందఱి స్త్రీల రూపగుణాదులు వారి భర్తల మనస్సుకు ఇష్టంగా ఉండవచ్చు. కాని వాటికి ప్రాప్తి ఉండదు. అందువల్ల అభిమతమైనది అనురూపం కాకుండా,

అనురూపమైనది అభిమతం కాకుండా ఉండే స్వభావం లోకంలో కన్పిస్తున్నందువల్ల, ఈ దివ్యదంపతుల విషయంలో ఆ విధంగా లేదు- అని తెలుపబడింది. అభి మతత్వం, అనురూపత్వం కలసి లోకంలో ఎక్కడో ఒకచోట కలసి ఉన్నా, అన్ని అంశాలలోను అనురూపంగా, అభిమతంగా కలసి ఉండడం సుతరాం అరుదు. దేహగుణాలు మంచివి అయితే, ఆత్మగుణాలు మంచివిగా ఉండవు. ఆత్మగుణాలు మంచివి అయితే దేహగుణాలు మంచివి కావు- అని ఈ విధంగా వైరూప్యం కన్పిస్తుంది. ఈ విధంగా కాకుండా దివ్యదంపతులకు స్వరూపరూప గుణవిభవైశ్వ ర్యాదులనే అన్ని అంశాలలోను అభిమతత్వం, అనురూపత్వం - అనే రెండు కలసి ఉన్నాయని తెలుపబడింది.

ఈ మొదటి విశేషణంలో గుణశబ్దం రెండు సార్లు ప్రయోగింపబడింది. మొదట ఉండే గుణశబ్దం దేహగుణాలైన సౌందర్యలావణ్యాదులను తెల్పుతున్నది. తరువాత ప్రయోగింపబడిన గుణశబ్దం వాత్సల్యసౌశీల్యాదులైన ఆత్మగుణాలను తెల్పుతున్నది.

**(విభవ)** - విభవమంటే -భోగానికి ఉపకరణాలై, పొగడదగినవిగా ఉండే వస్తుసమూహాలు. అటువంటి సకలవస్తువులు భగవానునకు చెందినవై ఉండగా, లక్ష్మీదేవికి చెందినది- అని ప్రత్యేకంగా విభవమనేది ఒకటి ఉన్నదా ? అని అంటే, లోకంలో దంపతులవద్ద కన్పించే పద్ధతిని అనుసరించి పత్నికి చెందినవి అని చెప్పబడే మాల్యభూషణవస్త్రాదులు అనేకం ఉన్నాయి కదా! విభవావతార -అర్చావ తారాలలో దీనిని గమనించవచ్చు.

**(ఐశ్వర్య)** - ఐశ్వర్యమంటే నియామకత్వం. సర్వనియామకుడు భగవాను డైనపుడు, ఈమెకుకూడా నియామకత్వం ఉన్నదా? అని అంటే, భగవదిచ్ఛా ప్రయుక్తమైన నియామకత్వం ఈమెకు ఉండవచ్చుకదా ! **"శేషశేషాశనాదిపరిజనం భగవతః తత్తదవస్థోచితపరిచర్యాయా మాజ్ఞాపయంత్యా"** (ఆదిశేషుడు, విష్వక్సేనుడు మొదలైన పరిజనాన్ని భగవానునియొక్క ఆయా స్థితులకు తగిన పరిచర్యలలో ఆజ్ఞాపిస్తున్నది) అని శ్రీవైకుంఠగద్యంలో పల్కిన విషయంకూడా గమనించదగినది. **"చేతనర్కళై కర్మానుగుణమాక నియమిప్పళ్; ఈశ్వరనై రక్షణానుగుణమాక నియమిప్పళ్"** (చేతనులను వారి వారి కర్మలకు అనుగుణంగా నియమిస్తుంది; ఈశ్వరుని జీవుల రక్షణకు అనుగుణంగా నియమిస్తుంది) అని ఆచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించారు.



**(శీల+ఆది)** - తక్కువవారితో సైతం ఏభేదం, సంకోచం లేకుండా కలసి వ్యవహరించడమే శీలం. సౌశీల్యం అనేదికూడా ఇదే. భగవానుని శీలం గుహ పెరుమాళ్ మొదలైనవారిపట్ల వ్యక్తమైనట్లుగా, లక్ష్మీదేవి శీలం త్రిజటాదులపట్ల పూర్ణంగా ప్రకాశించిన విషయాన్ని గమనించాలి. **"ఆది"** అనే పదంచేత వాత్సల్య-సౌలభ్యాది గుణాలు గ్రాహ్యాలు.

**(అనవధికాతిశయ)** - ఇది గుణాలకు ప్రయోగింపబడిన విశేషణం. దీని భావం ఏమి? అంటే, ఇక్కడ చెప్పబడ్డ గుణాలలో కొన్ని గుణాలు గాని, అన్ని గుణాలు గాని, లోకంలోని వారిలో కొందఱిలో కన్పించినా, అవి కొంచెం కొంచెంగా కన్పిస్తాయి తప్ప, ఒక్కొక్క గుణం అంతు లేని ఉత్కర్షను కల్గి ఉండవు. లక్ష్మీ విషయంలో అయితే, ఆ విధంగా కాదు; ఒక్కొక్క గుణంయొక్క గొప్పతనం అవధి లేనిదై ఉంటుంది- అని తాత్పర్యం.

**(అసంఖ్యేయకల్యాణగుణగణామ్)** - లక్ష్మీదేవి గుణాలు ప్రత్యేకంగా ఇన్ని అని లెక్కకట్టడానికి సాధ్యం కాకపోవడమే కాక, వాటి సమూహాలుకూడా లెక్కలేనివై ఉంటాయి. లోకంలో అపరిమితంగా ఉండే కొన్ని వస్తువులను వేఱ్వేరుగా లెక్కించలేకపోయినా, **"నూఱు కుంచాల ధాన్యం, వేయి కుంచాల నువ్వులు"** అనే రీతిలో రాశుల సంఖ్యలో లెక్కించవచ్చు. లక్ష్మియొక్క గుణాలను చూస్తే, భగవద్గుణాలవలెనే అవికూడా ఏరీతిలోను లెక్కించడానికి సాధ్యం కానివిగా ఉన్నాయి- అని తాత్పర్యం.

**(పద్మవనాలయామ్)** - **"పద్మే స్థితామ్ పద్మవర్ణామ్"** (పద్మంలో ఉన్నది, పద్మవర్ణాన్ని కల్గినది) అని శ్రుతి అన్నది. ఇక్కడ **"పద్మ"** శబ్దంచేత లోకంలోని మంగళకరాలైన సకలవస్తువులు చెప్పబడ్డాయి. అందుచేత ఈమె సర్వమంగళ నివాసిని- అని భావం. **"యచ్చ హి మంగళం కిమపి యల్లోకే సదిత్యుచ్యతే, తత్సర్వం త్వదధీనమేవ"** (లోకంలో ఏది మంగళమో, ఏది 'సత్' అనే పదంచేత చెప్పబడుతున్నదో, అది అంత నీ అధీనమే) అని అంటూ కూరేశులుకూడా శ్రీస్తవంలో ఈ సంగతిని పలికారు. పరిమళమే మూర్తీభవించినవాడైన భగవానునకు కూడా పరిమళాన్ని కల్గించగల్గిన పరిమళప్రచురమైన పద్మవనాన్ని నివాసంగా కల్గినది - అని భావం.

**(భగవతీమ్)** - **"తత్ర పూజ్యపదార్థోక్తిపరిభాషా సమన్వితః, శబ్దోఽయం నోపచారేణ"** అని శ్రీవిష్ణుపురాణంలో చెప్పబడిన రీతిలో పూజ్యవాచకంగా ఈ పదాన్ని గ్రహించాలి.

**(శ్రియమ్)** - 1. సకలచేతనాలచేత పురుషకారంకోసం ఆశ్రయింపబడేది. 2. ఆశ్రితుల కార్యాలను నెఱవేర్చడంకోసం భగవానుని సదా ఆశ్రయించి ఉండేది. 3. ఆశ్రితుల విన్నపాలను చెవి ఒగ్గి వినేది, 4. వాటిని భగవానునకు వినిపించేది, 5. ఆశ్రితుల అపరాధాలను హింసించేది- నశింపజేసేది, 6. తన కల్యాణగుణాలతో లోకాలను ఆనందింపజేసేది- అని ఈ విధంగా ఆఱు అర్థాలను ఇచ్చే ఆఱు విధాలైన వ్యుత్పత్తులతో **(1. శ్రీయతే, 2. శ్రయతే 3. శ్రుణోతి, 4. శ్రావయతి, 5. శృణాతి, 6. శ్రీణాతి)**-నిష్పన్నమయిన శబ్దంకదా శ్రీశబ్దం. ఈ నామంలోని సాటి లేని గొప్పతనాన్ని **"శ్రీరిత్యేవ చ నామ తే భగవతి ! బ్రూమః కథం త్వాం వయమ్"** (పూజ్యులారా! నీ పేరు శ్రీ అనియే. ఇటువంటి నీ గొప్పతనాన్ని గూర్చి ఏవిధంగా పలుకగలం!) అని ఆళవన్దార్, **"శ్రీరసి యతః"** అని భట్టర్ వ్యక్తం చేశారు.

**(దేవీమ్)** -ఇది **"దివు-క్రీడా-విజిగీషా-వ్యవహార-ద్యుతి-స్తుతి-మోద-మద-స్వప్న-కాంతి-గతిషు"** అని పది అర్థాలను కల్గిన **"దివు"** ధాతువులోనుండి **"దీవ్యతీతి దేవీ"** అని నిష్పన్నమైనశబ్దం కనుక, యథోచితంగా ఆ యా అర్థాలను గ్రహించ వచ్చు. **"ఇన్బుఱు మివ్విళైయాట్టుడైయవళ్"** (ఆనందాన్ని కల్గించే ఈ లీలలను కల్గినది) అని చెప్పవచ్చు. భగవానునితో కలయికవల్ల ప్రకాశించేది - అని కూడా అర్థం.

**(నిత్యానపాయినీమ్)** - ఈ పదంద్వారా **"విష్ణోః శ్రీరనపాయినీ"** అని శ్రీవిష్ణుపురాణంలో **(1-8-1)** చెప్పబడిన అంశం ప్రత్యభిజ్ఞాపనం చేయబడింది. సూర్యుని ప్రభ, పుష్పాన్ని పరిమళం విడచి ఉండనట్లు భగవానుని విడచి ఉండనిది- అని అర్థం. అవతారాలలో భగవానుని ఈమె కొన్నాళ్ళు విశ్లేషించినప్పటికి దానివల్ల ఈమె నిత్యానపాయినీత్వానికి ఏభంగం లేదని -అంటారు. **"అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా"** (సూర్యునికంటే కాంతి వేఱు కానట్లు, శ్రీరాముని కంటే నేను వేఱు కాదు) అని ఒక మాఱు సీతాదేవి, **"అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా"** (సూర్యునికంటే కాంతి వేఱు కానట్లు, సీత నాకంటే వేఱుకాదు) అని వేఱొక మాఱు శ్రీరాముడు పల్కడాన్ని గమనించవచ్చు. **"ప్రభావాన్ సీతయా దేవ్యా పరమవ్యోమభాస్కరః"** (పరమాకాశమనబడే పరమపదంలో సూర్యునివంటి వాడు, ప్రకాశించే సీతాదేవిరూపంలోని ప్రభను కలవాడు) అని అన్నారు వేదాంతదేశికులు కూడా.

**(నిరవద్యామ్)** - అవద్యాలను (దోషాలను) లేనిది. పూర్వం పల్కిన ఉత్కర్ష అంతా తన గొప్పతనంగా భావించడం అవద్యం. అటువంటి అవద్యాన్ని లేనిది-



అని భావం. వెన్నెల, చందనం, పుష్పం, మారుతం- మొదలైనవానిలోని గుణాలు ఏవిధంగా ఇతరుల అతిశయాధానానికే ఉపయోగపడతాయో, ఆ విధంగానే ఆమె గుణాలు అన్నీ భగవానునకు అతిశయాన్ని కల్గించడంకోసమే ఉపయోగపడతాయి- అని సారం.

**(దేవదేవదివ్యమహిషీమ్)** - ఈ విశేషణతాత్పర్యాన్ని శ్రుతప్రకాశికాచార్యులవారు **"అప్రతిహతచికీర్షితామ్"** అని వ్యక్తం చేశారు తాను దేనిని చేయాలని భావించినా ఏవిధమైన ఆటంకం లేకుండా చేసి పూర్తి చేయడానికి తగిన సామర్థ్యాన్ని ఈమె కల్గినదని భావం. ఏలోటు లేని పురుషకారాన్ని చేయగల్గినదని సారం. బ్రహ్మ మొదలైన దేవతలందఱికంటే భగవానుడు ఉత్తమపురుషుడు అయినట్లు, ఆ బ్రహ్మాదుల పత్నులకంటే మహనీయురాండ్రైన భగవత్పత్నులు అందఱిలో ఈమె ప్రధానతమ- అనే అర్థం ఇక్కడ వివక్షితం.

**(అఖిలజగన్మాతరమ్)** - **"దేవదేవదివ్యమహిషీమ్"** అని అనగానే ఒకవిధమైన భయం కల్గుతుందికదా! ఆ భయాన్ని పోగొట్టడంకోసం ఈ విశేషణం ప్రయోగింప బడింది. తన సంతానం అయిన జీవులపట్ల వాత్సల్యాన్ని మిక్కిలిగా కల్గినదని భావం.

**(అస్మన్మాతరమ్)** - వేదాంతదేశికుల పాఠంతో ఈ విశేషణం లేదని తెలుస్తున్నది. **"అత్ర అస్మత్స్వామిన్" ఇతివత్ అస్మన్మాతరమితి శ్రీవిష్ణుచిత్తాదయః పఠంతి వ్యాచక్షతే చ"** అని గద్యభాష్యంలో ఉన్నది. పలువురి పాఠంలో **"అస్మన్మా తరమ్"** అనే పాఠం ఉన్నది. కన్పడుతున్నది. ఇక్కడ ఆచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానంలో **"అఖిలశబ్దత్తిల్ తాముమ్ అంతర్భూతరాకైయాలై తమ్మైయుమ్ కూట్టిక్కొళ్ళు కిఱార్"** అని ఉన్నది. కాని, కోయిల్ పత్తరావిస్వామి తిరుమాళిగలోని తాళపత్ర గ్రంథాలను పరిశీలించినపుడు- **"అఖిలపదత్తిల్ తాముమ్ అంతర్భూతరాయిరుక్క చ్చెయ్ దేయుమ్ అఖిలజగత్తుమ్ ఒరు తట్టుమ్ తామ్ ఒరు తట్టుమాక తమ్ పక్కల్ వాత్సల్యాతిశయమ్ కణ్డారాకైయాలే విశేషిత్తు అరుళిచ్చెయ్‌కిఱార్ - "అస్మన్మాతరమ్ ఎన్ఱు"** (అఖిలపదంలో తాముకూడా ఒకరు అయినా, అఖిలజగత్తు ఒక ఎత్తు, తాము ఇంకొక ఎత్తు - అనే రీతిలో తమపట్ల లక్ష్మీదేవి చూపిన గొప్ప వాత్సల్యాతిశయాన్ని చూచినవారు కనుక, విశేషించి **"అస్మన్మాతరమ్"** అని అంటున్నారు)- అనేది సంస్కరింపబడిన పాఠం కన్పించింది.

**(అశరణ్యశరణ్యామ్)** - సర్వలోకశరణ్యునిచేత పరిత్యజింపబడినవారికి కూడ తాను శరణమై ఉన్నది - అని భావం. **"తిరువడియై ప్పొఱుప్పిక్కుమవళ్ తన్ శొల్వழி వరుమవనై ప్పొఱుప్పిక్క చ్చొల్లవేణ్డావిఱే"** (హనుమానుని అంగీకరింప జేయగల్గినది తన మాట దారిలో వచ్చేవానిని అంగీకరింపజేస్తుందని చెప్పనక్కరలేదు కదా) అనే రీతిలో అపరాధానికి తగిన దండనను ఇచ్చే భగవానునిచేత క్షమింపజేసి రక్షించేది- అని భావం. ఈ విధంగా ఉండే ఇటువంటి లక్ష్మీదేవిని,

**(అనన్యశరణః అహం శరణం ప్రపద్యే)** - **"పుకలొన్రిల్లా అడియేన్ ఉన్ అడిక్కీழ் అమర్న్దు పుకున్దేన్"** (ఏ శరణం లేని నేను నీ చరణాల కింద చేరి ఉండి శరణాగతిని చేశాను) అని భావం. ఇక్కడ **"ప్రపద్యే"** అనే ఉత్తమపురుషక్రియ ఉన్నందువల్ల నేను అనే కర్త స్ఫురించవలసి ఉన్నప్పటికీ, **"అహమ్"** అని అనడం విశేషించి తమను నిర్దేశించుకొంటున్నారని భావం. ఆ శక్తివల్ల, స్వరూప విరోధ నిశ్చయంవల్ల ఉపాయాంతరాలలో ఆసక్తిని లేనివాడను నేను- అని తమ స్వభావాన్ని స్పష్టం చేసినట్లయినది. ఈవిధం శ్రీరామానుజులు మొదటి చూర్ణికలో పురుషకార ప్రపత్తిని చేశారు.

ఇక రెండవ చూర్ణికలో, పురుషకారస్వరూపిణి అయిన లక్ష్మీదేవివద్ద ప్రార్థించదగిన విషయం విన్నపింపబడుతున్నది.

**2. పారమార్థిక భగవచ్చరణారవిన్దయుగళైకాన్తికాత్యన్తిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తికృత పరిపూర్ణానవరత నిత్యవిశదతమానన్యప్రయోజనానవధికాతిశయ ప్రియభగవదనుభవజనితానవధికాతిశయ ప్రీతికారితాశేషావస్థోచితాశేష శేషతైకరతి రూప నిత్యకైఙ్కర్యప్రాప్త్యపేక్షయా పారమార్థికీ భగవచ్చరణారవిన్ద శరణాగతిర్యథావస్థితా అవిరతాऽస్తు మే ॥**

**పారమార్థిక** = పరమపురుషార్థరూపమైన (ఇది భక్తికి విశేషణం), **భగవచ్చరణారవింద యుగళైకాంతిక** = భగవానుని శ్రీచరణాలనే విషయంగా కల్గినది, **ఆత్యంతిక** = ఏనాటికి అయినా నిలచి స్థిరంగా ఉండే, **పరభక్తి పరజ్ఞాన పరమభక్తి** = పరభక్తి - పరజ్ఞానం - పరమభక్తి అనే వీటిచే, **కృత** = చేయబడిన (పుట్టిన) (దీనిని భగవదనుభవంలో అన్వయించాలి), **పరిపూర్ణ**= నిండైన, **అనవరత**= నిరంతరమైన, **నిత్య** =నిత్యమైన, **విశదతమ** = చాలా విశదమైన, **అనన్యప్రయోజన**= స్వయంప్రయోజనమై, **అనవధిక+అతిశయప్రియ** = దీనికి మించిన ప్రియమైనది



ఇంకొకటి లేదు- అనే రీతిలోని, **భగవదనుభవ** = భగవానుని అనుభవంవల్ల, **జనిత** = పుట్టిన, **అనవధిక+అతిశయ ప్రీతి** = చాలా గొప్పదైన ప్రీతి కారణంగా, **కారిత** = చేయబడిన, (ఇది నిత్యకైంకర్యంలో అన్వయిస్తుంది), **అశేష+అవస్థా+ ఉచిత** = (భగవానుని) ఆస్థానంలో ఉన్నప్పుడు, అంతఃపురంలో ఉన్నపుడు, ఆయా సకలసన్నివేశాలకు తగినవి అయిన, **అశేషశేషతైకరతిరూప** = సకలవిధకైంకర్యాలలో ఆశను కల్గి ఉండడమే రూపంగా గల, **నిత్యకైంకర్య ప్రాప్తి+అపేక్షా** = నిత్యకైంకర్యాన్ని పొందడంలోని ఆశకు తగినట్లుగా, **పారమార్థికీ** = యథార్థమైన, **భగవచ్చరణారవింద శరణాగతిః** = భగవానుని శ్రీచరణపద్మాలలోని శరణాగతి, **యథావస్థితా అవిరతా మే అస్తు** = అది సిద్ధించవలసిన రీతిలో సిద్ధించినదై, అడ్డగింపబడనిది కాకుండా నిరంతరంగా నాకు సిద్ధించాలి.

**3. అస్తు తే ॥ 4. తయైవ సర్వం సమ్పత్స్యతే ॥**

ఇది లక్ష్మీదేవియొక్క ప్రతివచనం.

**తే అస్తు** = ఆ విధంగానే నీకు సిద్ధించాలి. **తయా ఏవ** = ఆ శరణాగతి వల్లనే, **సర్వం సంపత్స్యతే** = మీ అభిమతం అంతా చక్కగా సిద్ధించగలదు.

ఈ సమాధానానికి ముందు **"అస్తు మే"** అని కోరినవారి కోరికకు తగినట్లు **"అస్తు తే"** అని మాత్రం సమాధానం అనుగ్రహిస్తే సరిపోతూ ఉండగా, దానికి మించి **"తయైవ సర్వం సంపత్స్యతే"** అని పల్కిన లక్ష్మీదేవి హృదయాన్ని శ్రుత ప్రకాశికాచార్యులవారు **"స్వసంబంధిసంబంధి విస్తరణ మపి సర్వశబ్దాభిప్రేతమ్"** (తమతో సంబంధాన్ని కలవారియొక్క, వారితో సంబంధాన్ని కలవారియొక్క ఈ విధంగా సంబంధిసంబంధులవరకు చేయదగిన ఉజ్జీవనంకూడా "సర్వ" శబ్దంచేత వివక్షితం) - అని వివరించారు.

ఇటువంటి వరం భగవానుని నోటి నుండి వచ్చినదని సంప్రదాయం. దానిని వేదాంతదేశికులు న్యాసతిలకంలో **"ఉక్త్యా ధనంజయవిభీషణలక్ష్య యాతే ప్రత్యాయ్య లక్ష్మణమునే! భవతా వితీర్ణమ్, శ్రుత్వా వరం తదనుబంధమదావలిప్తే సత్యం ప్రసీద భగవన్! మయి రంగనాథ"** అనే శ్లోకరత్నాన్ని అనుగ్రహించారు. ఈ శ్లోకంలో **"శ్రుత్వా వరమ్"** అని ఉన్నందువల్ల శ్రీరంగనాథుడు ఒక వరాన్ని శ్రీరామానుజులకు ఇచ్చినట్లు తెలుస్తున్నది. అది ఏ వరం? అనే విషయాన్ని వ్యాఖ్యాతలు **"వరప్రదానప్రకారశ్చేత్థమ్"** అని ప్రారంభించి వివరించారు. కాని, ఇతరులు వ్యాఖ్యానించవలసిన అక్కఱలేనట్లుగా వేదాంతదేశికులవారు తామే

మూలంలో **"తదనుబంధమదావలిస్తే"** అని కంఠతః పలికారు. శ్రీరామానుజుల కాలానికి శ్రీదేశికుల కాలానికి మధ్య చాలా కాలవ్యవధి ఉన్నా, "శ్రీరామానుజులతో సాక్షాత్ సంబంధం నాకు లేకపోయినా, పరంపరా సంబంధం ఉన్నది, కనుక దానిని బట్టి నాకు ఫలం తప్పక లభిస్తుందని గర్వపడుతున్నాను. నేను ఈవిధంగా గర్వించడానికి కారణం శ్రీరంగనాథా! నీవు మా కులమూలమైన శ్రీరామానుజులకు ఇచ్చిన వరమే సుమా'' - అని స్పష్టం చేశారు. కనుక, అటువంటి వరప్రదానాన్ని శ్రీరంగనాథుడు చేయడానికి ముందు లక్ష్మీదేవికూడా తన నోటిని తెఱచి ఒక వరాన్ని అనుగ్రహించినట్లుగా శ్రుతప్రకాశికాచార్యులవారు చేసిన వాఖ్య సత్సంప్రదాయ సిద్ధార్థమని అనడంలో ఏ సందేహం లేదు.

**5. అఖిలహేయప్రత్యనీక కల్యాణైకతాన స్వేతరసమస్తవస్తువిలక్షణానన్త జ్ఞానానన్దైకస్వరూప!**

ఇక, ఈ చూర్ణికనుండి **"శ్రీమన్నారాయణ! అశరణ్య శరణ్య!"** అనే ప్రయోగం (చూర్ణిక) వరకు శ్రీరంగనాథుని అనేకవిధాలుగా సంబోధించి, **"అనన్య శరణః త్వత్పాదారవిందయుగళం శరణమహం ప్రపద్యే"** అని స్వకీయ శరణాగతిని గూర్చి శ్రీరామానుజులు పల్కి ముగిస్తున్నారు. ఇందులో **"అఖిలహేయ"** అని ప్రారంభించి, **"జ్ఞానానందస్వరూప"** అనే పర్యంతం మొదటి సంబోధన.

**అఖిలహేయ ప్రత్యనీక** = ఎటువంటి దోషాలకు అయినా ప్రతిభటమై, **కల్యాణ+ఏకతాన** = మంచికి ముఖ్యస్థానమై, **స్వేతర సమస్తవస్తు** = తనకన్న వేఱయిన, సమస్త వస్తువులకంటే, **విలక్షణ** = విలక్షణమై, **అనన్త** = సర్వవ్యాపి కనుక దేశపరిచ్ఛేదరహితమై, సర్వకాలవర్తి కనుక కాలపరిచ్ఛేదరహితమై, సర్వ వస్తువులు తానే అయినందువల్ల వస్తుపరిచ్ఛేద రహితమై (ఈవిధంగా మూడు విధాలైన పరిచ్ఛేదాలు లేనందువల్ల అనంతశబ్దవాచ్యమైన), **జ్ఞాన+ఆనంద+ఏకస్వరూప** = స్వయంప్రకాశకం కనుక జ్ఞానమే స్వరూపంగా, సుఖరూపమైనందువల్ల ఆనందమే స్వరూపంగా కలవాడా!

**6. స్వాభిమతానురూపైకరూపాచిన్త్య దివ్యాద్భుత నిత్యనిరవద్య నిరతిశయౌజ్జ్వల్య సౌన్దర్యసౌగన్ధ్య సౌకుమార్యలావణ్యయౌవనాద్యనన్త గుణనిధిదివ్యరూప!**

(ఇంతవరకు భగవానుని దివ్యాత్మస్వరూపాన్నిగూర్చి చెప్పబడింది). స్వరూప-రూప - గుణవిభూతులు - అనే క్రమంలో ఇంతవరకు స్వరూపాన్ని గూర్చి వర్ణింపబడింది. ఇకపై రూపం వర్ణింపబడుతున్నది) - రూపం అంటే - దివ్యమంగళ విగ్రహం. అది ఏవిధంగా ఉన్నది? అని అంటే,



**స్వాభిమత** = దివ్యాత్మస్వరూపం కంటే ఇష్టమైనది, **అనురూప** = తగినది, **ఏకరూప** = షడ్భావవికారాలను వేనినీ లేనిది, **అచింత్య** = ప్రాకృతవస్తువులతో సాటి అని భావించడానికి వీలు లేనిది, **దివ్య** = అప్రాకృతమైనది, **అద్భుత** = ప్రతిక్షణం అపూర్వంగా భాసిస్తున్నది, **నిత్య** = స్వరూపగుణాలవలె అనాది నిధనమైనది, **నిరవద్య** = దుర్లభత్వం మొదలైన దోషాలను వేటిని లేనిది, (లేక, **"నిత్యనిరవద్య"** అనే ప్రయోగాన్ని ఒకే పదంగా గ్రహించి, ఎల్లప్పుడు నిరవద్యంగా ఉన్నది- అనే అర్థాన్ని గ్రహించవచ్చు. అంటే- ఎల్లప్పుడు స్వార్థంగా ఉండనిది- అని భావం. "అడియోముక్కే ఎమ్బెరుమానల్లీరో నీర్ !" అనే రీతిలో ఎల్లప్పుడు భక్తుల కోసమే వినియోగపడేది- అని దీని భావం) **నిరతిశయ+ఔజ్జ్వల్య** = దీనికి మించిన కాంతి లేదు అనే రీతిలోని గొప్పకాంతిని కల్గినది, **సౌందర్య సౌగంధ్య సౌకుమార్య లావణ్యయౌవనాది + అనంతగుణనిధి** = అవయవ శోభ అనే సౌందర్యం, దివ్యపరిమళం, దివ్యదేవేరులు సైతం నిశితంగా చూడడానికి జంకే రీతిలోని సౌకుమార్యం, సముదాయశోభ - అనే లావణ్యం, ఎల్లప్పుడు ప్రాయం మాఱకుండా ఉండడం - అనే యౌవనం - మొదలైన అపరిమితగుణాలకు నిధివంటిది అయిన, **దివ్యరూప** = దివ్యమంగళవిగ్రహాన్ని కలవాడా!

**7. స్వాభావికానవధికాతిశయ జ్ఞానబలైశ్వర్య వీర్యశక్తి తేజస్సౌశీల్యవాత్సల్య మార్దవార్జవ సౌహార్దసామ్యకారుణ్య మాధుర్యగామ్భీర్యౌదార్య చాతుర్యస్థైర్య ధైర్యశౌర్యపరాక్రమ సత్యకామ సత్యసఙ్కల్ప కృతిత్వ కృతజ్ఞతాద్యసఙ్ఖ్యేయ కల్యాణ గుణగణౌఘమహార్ణవ !**

ఇంతవరకు భగవానుని విగ్రహవైలక్షణ్యాన్నిగూర్చి పల్కి, ఇక దివ్యాత్మ స్వరూపాన్ని గూర్చి పల్కుతున్నారు.

**"స్వాభావిక, అనవధికాతిశయ"** అనే రెండు విశేషణాలు తరువాత చెప్పబడే గుణాలు అన్నిటిలోను అన్వయిస్తాయి. స్వాభావికాలు, నిస్సమాభ్యధికాలు (సాటి అయినవి, మించినవి లేనివి) అయిన షాడ్గుణ్యం మొదలైన కల్యాణగుణాలకు సముద్రంవంటివాడా! అని భావం. ఈ గుణాలు స్వాభావికాలై ఉండడం అంటే- నీటికి చల్లదనంవలె, నిప్పుకు వేడిమివలె, నిరుపాధికంగా ధర్మి ఉన్నప్పుడు అంతా ఉండడం. ఒకనాడు ఉన్నవిగాను, వేఱొకనాడు లేనివిగాను కాకుండా, యావదాత్మ

భావిగా ఉండడం. ఇందువల్ల నిత్యముక్తుల గుణాలకంటే వీటికి గల వైలక్షణ్యం తెలుపబడింది. వారి గుణాలు భగవానుని ఇచ్ఛను అనుసరించి ఉంటాయి కనుక, అనన్యాధీనత్వమనబడే స్వాభావికత్వం వాటికి లేదు. అనవధికాతిశయత్వమంటే- ప్రతిగుణం అంతు లేని మహిమను కల్గి ఉండడం. పైన పేర్కొనబడే గుణాలలో కొన్ని ఇతరవ్యక్తులలో ఉన్నా, అవి పరిమిత మహిమను కల్గి ఉంటాయి. ఆవిధంగా కాకుండా ఇవి భగవానునిలో ఇంతకుమించి గొప్పతనం ఇంకొకటి లేదు -అనే రీతిలోని గొప్పతనాన్ని కల్గి ఉంటాయి. శ్రీభాష్యంలోని **"స్వభావతో నిరస్తనిఖిల దోషానవధికాతిశయాసంఖ్యేయకల్యాణగుణగణః పురుషోత్తమోఽభిధీయతే"** అనే సూక్తిని వ్యాఖ్యానిస్తూ శ్రీశ్రుతప్రకాశికాచార్యులవారు **"అనవధికాతిశయ"** అనే పదం నిత్యసిద్ధులనుండి వేఱు చేస్తున్నదనే ఒక నిర్వాహాన్ని చూపి, **"అనుషక్తేన స్వభావత ఇతి పదేన వా నిత్యసిద్ధవ్యావృత్తిః. తేషాం తాదృశగుణకత్వం హి భగవన్నిత్యేచ్ఛాధీనమ్"** అని తరువాత యోజనను పేర్కొనడం అనుసంధేయం.

ఇక, ఈ చూర్ణికలో ప్రస్తావింపబడ్డ దివ్యగుణాలు వివరింపబడుతున్నాయి. జ్ఞానశక్తిబలైశ్వర్య- వీర్యశక్తి తేజస్సులు ఆఱు కలిపి షాడ్గుణ్యమనబడతాయి. ఇవియే మిగిలిన అన్ని గుణాలకు ఆకరాలు. వీటిలో, **జ్ఞానం అంటే** - అన్నిటినీ ఒకేసారి ఎల్లప్పుడు యథాతథంగా తెలియగల్గడం. బలం అంటే- సంకల్పమాత్రంతో సకలపదార్థాలను ఏశ్రమ లేకుండా ధరించే శక్తి. **ఐశ్వర్యం అంటే** - సమస్తవస్తువులను నియమించే సామర్థ్యం. వీర్యమంటే -జగత్తుక్కు ఉపాదానకారణమై ఉన్నా స్వరూపవికారాన్ని ఏమాత్రం కల్గి ఉండకపోవడం. **శక్తి అంటే**- అఘటిత ఘటనాసామర్థ్యం. **తేజస్సు** అంటే- దేనికీ ఏ సహకారిని అపేక్షించకుండా ఉండడం. ఈ విధంగా ఇటువంటి షాడ్గుణ్యాన్ని ప్రస్తావించిన తరువాత, వీటినుండి ఉద్భవించే కల్యాణగుణాలను కొన్నిటిని ఇకపై ప్రస్తావిస్తున్నారు; **"సౌశీల్య"** అనే పదంనుండి ప్రారంభించి

**సౌశీల్యమంటే** - గొప్పవాడు తనకంటే తక్కువవారితో ఏభేదం లేకుండా కలసి వర్తించే స్వభావం. దీనికే శీలగుణమని పేరు. **వాత్సల్యమంటే**- అపుడే ఈనిన దూడ ఒంటిలో ఉండే మలినాన్ని ఆదరించే తల్లి ఆవువలె, ఆశ్రితుల దోషాలను భోగ్యంగా గ్రహించే గుణం. **మార్దవమంటే**- ఆశ్రితుల విశ్లేషాన్ని సహించలేకపోవడం, **ఆర్జవమంటే** - కరణత్రయంలో ఋజువుగా ఉండడం. దీనికి సాక్షాత్తు వ్యతిరేకమైన దుర్గుణం కౌటిల్యం. **సౌహార్దమంటే** - ఎల్లప్పుడు మంచిని



గూర్చి చింతించే గుణం. **సామ్యమంటే**- జాతిగుణవృత్తాలలో హెచ్చు తగ్గులను గణించకుండా అందఱికి సమానంగా ఆశ్రయించదగినవాడై ఉండడం. **కారుణ్యమంటే**- దుఃఖించినవారిని చూచి అయ్యో! అని భావించడం. **మాధుర్యమంటే**- చంపాలని తలచే శత్రువులకుసైతం భోగ్యమై ఉండడం. **గాంభీర్యమంటే** - ఆశ్రితులకు తాను చేయదలచినవానిని ఏనాటికీ ఎవరూ తెలిసికోవడానికి వీలు కాని రీతిలో లోతైన హృదయాన్ని కల్గి ఉండడం. **ఔదార్యమంటే**- ప్రతిఫలం ఆశించకుండా చాలా సమృద్ధిగా కోరినవానిని అన్నిటిని కోరినవారికి ఇవ్వడం. **చాతుర్యమంటే**- ప్రతికూలురనుకూడ అనుకూలురుగా చేసికోగల్గిన చతురత, **స్థైర్యమంటే**- ఆశ్రితులను ఏనాడూ విడువని గుణం, **ధైర్యమంటే**- ప్రతిపక్షం ప్రబలమైన ఉన్నా తృణీకరించడం (లెక్క పెట్టకుండా ఉండడం). **శౌర్యమంటే**- శత్రువుల గొప్ప సమూహంలోకి ఒంటరిగా ఏ జంకు లేకుండా ప్రవేశించడం. **పరాక్రమమంటే**- ఆ విధంగా యుద్ధభూమిలో ఒంటరిగా ప్రవేశించినా అవలీలగా శత్రువులను భంగపరచగల్గిన నేర్పు.

**"సత్యకామ, సత్యసంకల్ప"** అనే రెండు భావప్రధాననిర్దేశాలు కనుక, సత్యకామత్వం, సత్యసంకల్పత్వమనే అర్థాన్ని గ్రహించాలి. **సత్యకామత్వమంటే**- కోరినవానిని అన్నిటినీ ఏకొఱత లేకుండా సిద్ధించడం, **సత్యసంకల్పత్వం అంటే**- దేనిని చేయాలని అనుకున్నా, ఏఆటంకం లేకుండా దానిని పూర్తి చేయగల్గిన శక్తి. **కృతిత్వమంటే**- భక్తుల కార్యాలను చేస్తూ ఉండడం, **కృతజ్ఞత మంటే**- భక్తులు కొంచెం మంచిని చేసినా, దానిని ఏనాటికీ మఱువకుండా ఉండడం. ఈవిధంగా ఉండే,

**అసంఖ్యేయకల్యాణగుణ గుణ+ఓఘమహార్ణవ** = లెక్కించి పూర్తి చేయలేని కల్యాణగుణాలనే ప్రవాహాలకు సముద్రంవంటివాడా!

**8. స్వోచితవివిధ విచిత్రానన్తాశ్చర్య నిత్యనిరవద్య నిరతిశయసుగన్ధ నిరతిశయ సుఖస్పర్శ నిరతిశయౌజ్జ్వల్య కిరీటమకుటచూడావతంస మకరకుణ్డల గ్రైవేయక హార కేయూరకటక శ్రీవత్సకౌస్తుభ ముక్తాదామోదరబన్ధన పీతామ్బర కాఞ్చీగుణ నూపురాద్యపరిమిత దివ్యభూషణ!**

ఇంతవరకు భగవానుని కల్యాణగుణాలనుగూర్చి పల్కి, ఇకపై భగవానుని దివ్యాభరణాలనుగూర్చి పల్కుతున్నారు.

ఆత్మస్వరూపానికి అలంకారాలైన జ్ఞానం మొదలైన కల్యాణగుణాలను పూర్వమే ప్రస్తావించారు. దివ్యమంగళవిగ్రహానికి అలంకారాలైన భూషణాలను కొన్నిటిని ఇక్కడ ప్రస్తావిస్తున్నారు.

**స్వ+ఉచిత** = తనకు తగినవి, **వివిధ విచిత్ర** = పలు విధాలైన వైచిత్రిని కల్గినవి, **అనంత** = అపరిమితాలై, **ఆశ్చర్య** = ఆశ్చర్యాన్ని కల్గించేవి, **నిత్య**= శాశ్వతాలై, **నిరవద్య** = ఏవిధ దోషసంబంధాన్ని లేనివి, (లేక, **"నిత్యనిరవద్య"** అనే పదాలను పూర్వంవలె ఒకే సమస్తపదంగా గ్రహించి, ఎల్లప్పుడు దోషరహితాలై ఉన్నవి. అనే అర్థాన్ని చెప్పవచ్చు), **నిరతిశయ సుగంధ** = సాటి మేటి లేని పరిమళాన్ని కల్గినవి. **నిరతిశయ సుఖస్పర్శ** = ఏనాటికీ తొలగించనక్కరలేనట్లుగా సాటి లేని సౌకుమార్యాన్ని కల్గినవి, **నిరతిశయ+ఔజ్జ్వల్య** = సాటి లేని గొప్ప కాంతిని కల్గినవిగా ఉండే, **కిరీట** = కిరీటం, **మకుట** = మకుటం, **చూడా +అవతంస** = కేశపాశంలోని ఆభరణం, **కర్ణాభరణాలు**, **మకరకుండల** = మకరాకారంలోని కుండలాలు, **గ్రైవేయక** = కంఠాభరణాలు, **హార** = వక్షస్సులో అలంకరించే ముత్యాల మాలలు, **కేయూర** = బాహువులు, **కటక** = ముంజేతి కంకణాలు, **శ్రీవత్స** = ఇది పూర్వం పల్కిన ఆభరణాలవంటివి కాకుండా తిరుమేనిలో ఒక శ్వేతరోమావర్తమైనా, ఇది కూడా ఒక భూషణంవలె ప్రకాశిస్తున్నందువల్ల ఆభరణాలతో చేర్చి ఇది ప్రస్తావింపబడింది. శ్రీవత్సమంటే- భగవానుని పుట్టుమచ్చ. **కౌస్తుభ** = వక్షస్సులో అల్లల్లాడుతూ ప్రకాశించే గొప్పమణి, **ముక్తాదామ** = ఏకావళి, త్రిసరం, పంచసరం- అనబడే ముక్తాహారాలు. **ఉదరబంధన** = నడుముకు అలంకరింపబడే పట్టం, **పీతాంబర** = పురుషోత్తమత్వ లక్షణమైన పసుపుపచ్చని పట్టువస్త్రం, **కాంచీగుణ**= ఆ పీతాంబరం పై అలంకరింపబడే మొలనూలు, **నూపుర** = కాలి అందెలు. ఆది శబ్దంచేత యజ్ఞోపవీతం, సుదర్శనలాంఛితమైన అంగుళీయకం మొదలైనవి తెలుపబడతాయి. **దివ్యభూషణ** = ఇటువంటి అపరిమితాలైన దివ్యభూషణాలను కలవాడా! పెరియాళ్వార్‌తిరుమొழిలోని "శెజ్జమలక్కుழలిల్ శిత్తిదழ్‌పోల్ విరవిల్ శేర్ తికழ్ అழికళుమ్ కిజ్కిణియుమ్ అరైయిల్ తజ్గియ పొన్‌వడముమ్ తాళనన్మాదుకళైయిన్‌పూవొడు పొన్‌మణియుమ్ మోదిరముమ్ కిటియుమ్ మజ్గల ఐమ్బడైయుమ్ తోళ్‌వళైయుమ్ కుழైయుమ్ మకరముమ్ వాళికళుమ్ శుట్టియుమ్'' అను సూక్తి భావం ఇక్కడ అనుసంధేయం.



**9. స్వానురూపాచిన్త్యశక్తి శఙ్ఖచక్రగదాశార్ఙ్గాద్యసఙ్ఖ్యేయ నిత్యనిరవద్య నిరతిశయకల్యాణదివ్యాయుధ!**

ఇకపై భగవానుని దివ్యాయుధాలు ప్రస్తావింపబడుతున్నాయి.

**స్వ+అనురూప** = తనకు తగినది, **అచింత్యశక్తి** = మనస్సుతో కూడ భావించరాని శక్తిని కల్గినది, **శంఖచక్ర గదాశార్ఙ్గాది** = శంఖం, చక్రం, గద, విల్లు మొదలైన, **అసంఖ్యేయ** = లెక్కపెట్టలేనివి, **నిత్య నిరవద్య** = కాలం గడిచేకొలది ప్రకాశం తఱిగిపోకుండా, ఎల్లప్పుడు ఒకే విధంగా ప్రకాశిస్తున్నవి, **నిరతిశయకల్యాణ** = సాటి మేటి లేని శోభను కల్గించేవిగా ఉండే, **దివ్య+ఆయుధ** = దివ్యాయుధాలను కలవాడా!

ఈ వాక్యంలో **"గదా"** అనే పదానికి పిమ్మట **"అపి"** అనే పదాన్ని కలిపి పఠించే వేఱొక పాఠం ఉన్నది. అది లేని పాఠమే నంబిళ్ళై ఆదరించిన పాఠం.

**10. స్వాభిమత నిత్యనిరవద్యానురూప స్వరూపరూపగుణవిభవైశ్వర్య శీలాద్యనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణగణశ్రీవల్లభ !**

ఇక, దివ్యమహిషీవర్గంతో చేరికనుగూర్చి ప్రస్తావిస్తున్నారు.

లక్ష్మీదేవికి చెందిన మొదటి చూర్ణికలో ప్రయోగింపబడిన విశేషణమే ఇక్కడ కూడా ప్రయోగింపబడుతున్నది. భగవదనుభవరసికులైన శ్రీరామానుజులకు ఉండే ఆదరాతిశయం వారిని ప్రేరేపించగా పలికే మాటలు కనుక ఇక్కడ పునరుక్తి దోషాన్ని సంభావించే అవకాశం లేదు.

పెరియవాచ్చాన్‌పిళ్ళై తమ వ్యాఖ్యలో "మొదటి చూర్ణికలోకూడా ఈ గుణాలు చెప్పబడినా, మళ్ళీ ఇక్కడ ప్రస్తావింపబడడం పునరుక్తి కదా ! అని అంటే, వీరు ఈ కృతిద్వారా ఇతరులకు ఉపదేశించడం లేదు; అనుభవిస్తున్నారు. అందుచేత, ఆ అనుభవంలో కల్గిన ఆదరాతిశయం ఈ విధంగా వీరిచేత పల్కిస్తున్నది. కనుక పునరుక్తి శంక లేదు. లేక, అక్కడ శరణ్యతకు తగిన గుణాలు చెప్పబడ్డాయి. ఇక్కడ వాల్లభ్యానికి తగినవి చెప్పబడుతున్నాయి''- అని రస్యంగా వివరించారు.

**స్వాభిమత** = స్వాభిమతాలై, **నిత్యనిరవద్య** = నిత్యాలై, నిర్దోషాలై (నిత్యం నిర్దోషాలై), **అనురూప** = భగవానునకు తగినవై, **స్వానుగుణ** = తనకు తగినవై ఉండే అయిన, **రూపగుణ విభవ+ఐశ్వర్య** = రూపం, గుణాలు, విభవం, ఐశ్వర్యం,

శీల+ఆది = శీలం మొదలైన అనవధిక+ అతిశయ = అంతు లేని గొప్పతనాన్ని కల్గిన, అసంఖ్యేయ = లెక్కలేనన్ని, కల్యాణగుణ = కల్యాణగుణాల, గణ = సమూహాలను కల, శ్రీవల్లభ = లక్ష్మికి నాథుడైనవాడా !

"శ్రీవల్లభ" అనేటపుడు - లక్ష్మికి వల్లభుడా ! అని, లక్ష్మిని వల్లభగా కలవాడా!- అని రెండు రీతులలో అర్థాన్ని గ్రహించవచ్చు. మొదటి అర్థంలో **"తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వన్"** (లక్ష్మికి కూడా శోభాకరుడా) అని, రెండవ అర్థంలో ఆమె పల్కిన మాటను దాట లేని రీతిలో ఆమెకు విధేయుడై ఉంటాడని తెలుపబడింది.

**ఏవంభూత భూమినీళానాయక!**

**ఏవంభూత భూమినీళా నాయక** = ఇటువంటి రీతిలోనే ఉండే భూదేవికి, నీళాదేవికి నాయకుడైనవాడా!

పూర్వం **"స్వాభిమత"** అని ప్రారంభించి చెప్పబడిన కల్యాణ గుణగణాలు **"ఏవంభూత"** అని ఇక్కడ అతిదేశింపబడ్డాయి. లక్ష్మీదేవికి చెప్పబడిన గొప్పతనాలు అన్నీ భూదేవికి, నీళాదేవికి సమానం- అని భావం. **"కుழల్కోవలర్ మడప్పావైయుమ్ మణ్మకళుమ్ తిరువుమ్నిழల్పోల్వనర్"** (పిల్లనగ్రోవిని ఊదే గోపాలుర కాలంలో పుట్టిన అందమైన కన్య అయిన నీళాదేవి, భూదేవి - లక్ష్మీదేవికి నీడవంటివారు) అనే నమ్మాழ్వార్ల తిరువిరుత్త శ్రీసూక్తి అనుసంధేయం.

**11.** స్వచ్ఛన్దానువర్తి స్వరూప స్థితిప్రవృత్తి భేదాశేషశేషతైకరతిరూప నిత్యనిరవద్య నిరతిశయ జ్ఞానక్రియైశ్వర్యాద్యనన్తకల్యాణగుణగణ శేషశేషాశన గరుడప్రముఖనానా విధానన్తపరిజన పరిచారికా పరిచరిత చరణయుగళ!

ఇకపై, పూర్వం చెప్పబడ్డ గొప్పతనాలు అన్నీ అడవిలో కాచిన వెన్నెల కాకుండా నిత్యభోక్తలను కల్గి ఉండడం తెలుపబడుతున్నది.

ఆదిశేషుడు, సేనాపతియాழ్వాన్, గరుడుడు మొదలైన అపరిమిత పరి జనాలు, పరిచారికలు శ్రీచరణ సన్నిధిలో నిత్యకైంకర్యాన్ని చేసేటట్లు వేంచేసి ఉన్నవాడా! అని ఇందులో అంటున్నారు. ఆ దివ్యసూరులు ఎటువంటివారు? అని అంటే -

**స్వచ్ఛంద + అనువర్తి స్వరూప స్థితి ప్రవృత్తి భేద** = తన మనస్సుకు అను సరించి ఉండే స్వరూపస్థితి ప్రవృత్తులను కలవారై, **అశేషశేషతైకరతిరూప** = సకలవిధాలైన కైంకర్యాలను చేయాలని ఆశపడడమే రూపంగా కల్గినవారై, **నిత్య నిరవద్య నిరతిశయ జ్ఞానక్రియా ఐశ్వర్యాది అనంత (కల్యాణ) గుణగణ** = ఏనాటికీ (నిత్యంగా) ఏదోషం లేనివి, సాటి మేటి లేనివి అయిన జ్ఞానం, వ్యాపారం, నియమనం మొదలైన ఆ యా కల్యాణగుణసమూహాలను కలవారై ఉండేవారు, **"నిత్యనిరవద్య"** అనే దానిని నేరుగా శేష-శేషాశనాదులకే విశేషణం చేసి అర్థం చెప్పే తీరు కూడా ఉన్నది. అపుడు శేష-శేషాశనాదులకు నాల్గు విశేషణాలు ప్రయోగించినట్లవుతుంది. స్వాధీన స్వార్థ (యథేష్ట) కైంకర్యాలను చేయడమనే దోషాన్ని లేని వారు - అని దీని తాత్పర్యం. నిత్యనిరవద్యత్వాన్ని జ్ఞానాదులకు విశేషణంగా చేసినా, ఈ భావం వస్తుంది. జ్ఞాన దాస్యానికి అనుగుణమైన అసంకుచితజ్ఞానం, **క్రియా** = ఆ జ్ఞానానికి తగిన క్రియలు, **ఐశ్వర్య** = ఇతరులను నియమించే అధికారం, అది **అనంతగుణగణ** ఇత్యాది అనంతగుణాల గణాలను కలవాడా.



శేషాశనపదం విష్వక్సేనుని నామం. **"త్వదీయ భుక్తోజ్ఝిత శేషభోజినా... ప్రియేణ సేనాపతినా"** అనే ఆళవందార్ శ్రీసూక్తి స్మరణీయం. అనుగ్రహా, విమలా, కాంతి, వారుణీ, సుకీర్తి, రుద్రా, సూత్రవతీ - మొదలైనవారు పరిచారికలు. శ్రీరంగరాజస్తవంలోని **"లీలాలతాకృపాణీ", "ముకుళితనళినాః"** అనే శ్లోకాలలోను ఈ విషయం గమనించవచ్చు. **"మదిముక మడన్దైయర్"** (చంద్రునివంటి ముఖాన్ని కల వనితలు) అని నమ్మాழ్వార్లు కూడా అన్నారు.

**12.** పరమయోగివాఙ్మనసాపరిచ్ఛేద్య స్వరూపస్వభావ స్వాభిమత వివిధ విచిత్రానన్త భోగ్యభోగోపకరణ భోగస్థాన సమృద్ధానన్తాశ్చర్యానన్త మహావిభవానన్త పరిమాణ నిత్య నిరవద్య నిరతిశయ శ్రీవైకుణ్ఠనాథ!

ఇకపై ఇటువంటి భగవానుని దివ్యపదాన్నిగూర్చి పల్కుతున్నారు. **"పరమ యోగి"** - అని ప్రారంభించి, **"వైకుంఠనాథ"** అనే పర్యంతం ఒకే వాక్యంగా గ్రహించడమే సర్వాచార్యసమ్మతం. **"పరమయోగివాఙ్మనసాపరిచ్ఛేద్య స్వరూప స్వభావ"** అనే పర్యంతం ప్రత్యేక వాక్యంగా చేసి, దీనిని ప్రత్యేకంగా ఒక సంబోధనగా గ్రహించి, వ్యాఖ్యానించేవారుకూడా ఉన్నారు- అని శ్రీదేశిక భాష్యంలో తెలుపబడింది. శ్రుతప్రకాశికాచార్యులవారు ఆవిధంగా భావించినట్లు వారి వ్యాఖ్యానాన్నిబట్టి తెలుస్తున్నది. ఆ విధంగా పల్కిన ఆ ఆచార్యులవారుకూడా వెంటనే, **"పరమయోగీత్యాదికమ్ దేశవిశేషణమ్ వా; తథా శ్రీవైకుంఠగద్యోక్తేః"**

(పరమయోగి- అనే పదం దేశవిశేషంకూడా కావచ్చు. ఆ విధంగా శ్రీవైకుంఠ గద్యంలో చెప్పబడినందువల్ల) అని అన్నారు కనుక మొత్తం ఒకే వాక్యంగా గ్రహించడమే సరసం.

**పరమయోగి** = సనకసనందనాది గొప్ప యోగులయొక్క, **వాక్+మనస** = వాక్కులచే, మనస్సుచే, **అపరిచ్ఛేద్య** = పరిచ్ఛేదించలేని, **స్వరూప స్వభావ** = స్వరూపాన్ని, స్వభావాన్ని కల్గినది, **స్వాభిమత** = తనకు అభిమతమైన, **వివిధ** = అనేక విధాలైన, **విచిత్ర** = ఆశ్చర్యాన్ని కల్గించే, **అనంత** = అంతు లేని, **భోగ్య భోగోపకరణ** = భోగ్యవస్తువులు, వాటిని అనుభవించడానికి తగిన ఉపకరణాలు, **భోగస్థాన** = భోగాన్ని పొందడానికి అనువైన భోగస్థానాలు- అనే వీటిచే, **సమృద్ధ**= నిండినది, **అనంత** = అంతు లేనిది, **ఆశ్చర్య** = విచిత్రమైనది, **అనంత** = అంతు లేని, **పరిమాణ** = పరిమాణాన్ని కల్గినది, **నిత్యనిరవద్య** = నిత్యం నిర్దోషమైనది (నిత్యమైనది, నిర్దోషమైనది), **నిరతిశయ** = ఇంతకంటే గొప్పదైన అతిశయాన్ని కల్గినది ఇంకొకటి లేనిది అయిన, **వైకుంఠనాథ** = వైకుంఠానికి నాథా!

**13. స్వసఙ్కల్పానువిధాయి స్వరూపస్థితిప్రవృత్తి స్వశేషతైకస్వభావ ప్రకృతిపురుష కాలాత్మక వివిధవిచిత్రానన్త భోగ్యభోక్తృవర్గ భోగోపకరణ భోగస్థానరూప నిఖిల జగదుదయ విభవలయలీల!**

సకల జగత్తుల సృష్టి స్థితి సంహారాలను లీలగా కలవాడా! అని ఈ సంబోధనలోని భావం.

**స్వసంకల్ప+అనువిధాయి** = తనయొక్క సంకల్పాన్ని అనుసరించిన, **స్వరూపస్థితిప్రవృత్తి** = స్వరూపాన్ని, స్థితిని, ప్రవృత్తిని కల్గినవి, (ఈ విశేషణం ప్రకృతి, పురుష, కాలాలలో అన్వయిస్తుంది), **స్వశేషతైక స్వభావ** = తనకు శేషమై ఉండడమే స్వభావంగా కల్గినవి అయిన, (ఇదికూడా ప్రకృతి- పురుష- కాలాలకు విశేషణం), **ప్రకృతి పురుష కాలాత్మక** = ప్రకృతి, పురుషుడు, కాలం- అనే వీటి రూపంలోని (**ప్రకృతి, పురుషుడు,** కాలం - అనే మూడు జగత్తుగా పరిణమిస్తు న్నందున, **"ప్రకృతి పురుష కాలాత్మక"** అని నిర్దేశింపబడింది. ఈమూడిటియొక్క స్వరూపస్థితి ప్రవృత్తులు భగవానునకే అధీనాలై, ఇవి ఆ స్వామికే శేషమై ఉన్నందువల్ల ముందుగా ఈ రెండు విశేషణాలు ప్రయోగింపబడ్డాయి) ప్రకృతిపురుషకాలాలు అనే ఈ మూడింటిలోను, పురుషుడనబడే చేతనుడు భోక్త, ప్రకృతి- (ప్రకృతిశబ్దం



చేత ప్రాకృత వస్తువులన్నీ గ్రాహ్యాలు) భోగ్యభోగోపకరణ భోగస్థానాలుగా ఉంటుంది. ఈ జగత్తు కాలకాల్యం (కాలానుగుణంగా పరిణామాన్ని పొందుతుంది) అనే విషయాన్ని తెలుపడంకోసం ఇక్కడ కాలంకూడా కలిపి చెప్పబడింది. లేక, కాలాన్ని భోగోపకరణంలో కూడా చేర్చవచ్చు. ఈ విధంగా ప్రకృతి- పురుష-కాలాత్మకాలైన) **వివిధ** = అనేక విధాలైన, **విచిత్ర** = ఆశ్చర్యకరాలైన, **అనంత** = అపరిమితాలైన, **భోగ్య** = భోగ్యపదార్థాలు, **భోక్తృవర్గ** = భోక్తల సమూహాలు, **భోగోపకరణ** = భోగసాధనాలు, **భోగస్థానరూప** = భోగానికి అనువైన స్థానాలు- అనే వీటి రూపంలోని, **నిఖిల జగత్** = సకలలోకాలయొక్క, **ఉదయ** = పుట్టుక, **విభవ** = స్థితి, **లయ**= ప్రళయం -అనే వీటిని, **లీల** = లీలగా కల్గినవాడా!

**14. సత్యకామ ! సత్యసఙ్కల్ప ! పరబ్రహ్మభూత ! పురుషోత్తమ ! మహావిభూతే! శ్రీమన్! నారాయణ ! శ్రీవైకుణ్ఠనాథ !**

**సత్యకామ** = తలచిన దానిని అంతటిని నెఱవేర్చగలిగినవాడా ! **సత్య సంకల్ప** = సంకల్పించిన రీతిలో అంతటిని చేసి పూర్తిచేయగల్గినవాడా!, **పరబ్రహ్మభూత** = పరబ్రహ్మమనే పేరును కలవాడా!, **పురుషోత్తమ** = పురు షోత్తమా!, **మహావిభూతే** = అంతు లేని నియామ్యవస్తువులను (విభూతిని) కలవాడా!, **శ్రీమన్** = లక్ష్మీపతీ! **నారాయణ** = నారాయణుడనే పేరును కలవాడా!, **శ్రీవైకుంఠనాథ** = నిత్యవిభూతినాథా!

ఈ ఎనిమిది సంబోధనలు, ఇకపై చేయబోయే సంబోధనలు అన్నీ ఇంచు మించుగా పూర్వం చేయబడిన సంబోధనలద్వారా గతార్థాలే. అయినా, మిక్కిలిగా ఆర్తిని పొందినవాడు నీటి లోపలకు దిగి, నీటిని తాగడం, ముఖంపై ఒంటిపై జల్లుకోవడంవంటి పలు రీతులలో నీటిని ఉపయోగించుకొనే రీతిలో, శ్రీరామా నుజుల ఆర్తి విలక్షణమైనది కావడంచేత, వారిచే చేయబడిన ఈ సంబోధనలలో పునరుక్తి శంకను చేయడం, దానికి పరిహారాన్ని పల్కడం - అనే ఆవశ్యకత లేనే లేదు.

**15. అపారకారుణ్యసౌశీల్య వాత్సల్యౌదార్యైశ్వర్య సౌన్దర్యమహోదధే!**

**అపారకారుణసౌశీల్యవాత్సల్య+ ఔదార్య+ ఐశ్వర్య సౌందర్య మహోదధే**= అంతు లేని కరుణ, శీలగుణం, వాత్సల్యం, ఔదార్యం - అనే ఈ గుణాలకు గొప్ప సముద్రంవంటివాడా!

ఇక్కడ ఐశ్వర్యశబ్దాన్ని కలిపి పల్కడం విశేషించి గమనించదగినది. **"సంసారిణాం స్వరక్షణవిఘాతకత్వేఽపి తాన్ స్వాతంత్ర్యేణ నియమ్య రక్షితుం శక్త ఇత్యభిప్రేత్య ఐశ్వర్యమిత్యుక్తమ్"** (సంసారులు వారిని రక్షించే తన ప్రయత్నానికి విఘాతం కల్గించేవారైనా, వారిని తన స్వాతంత్ర్యంతో నియమించి రక్షించడంలో సమర్థుడు - అని భావించి ఐశ్వర్యశబ్దాన్ని ప్రయోగించారు) అని శ్రుతప్రకాశికాచార్యులవారి వ్యాఖ్యానశ్రీసూక్తి. శ్రీదేశికులు దీనిని బలపరుస్తూ పల్కిన ఈ శ్రీసూక్తి గమనించదగినది- **"ఐశ్వర్యస్య కథనమ్ ఇహ- అనాదికాలం స్వరక్షణవిపరీతవృత్తాన్ కేనచిత్ వ్యాజేన స్వయమేవ నియమ్య అభిముఖీకరోతీతి జ్ఞాపయితుమ్"** (ఇక్కడ ఐశ్వర్యాన్నిగూర్చి పల్కడం- అనాదికాలంగా తమ రక్షణకు విరుద్ధాలైన జీవుల ప్రయత్నాలను ఏదో ఒక నెపంతో స్వయంగా అడ్డగించి, అభిముఖులుగా చేస్తాడు- అని తెలుపడంకోసం) అని అన్నారు. **"ఇశైవిత్తు ఎన్నై ఉన్ తాళిణైక్కీళ్ ఇరుత్తుమమ్మానే !"** (నన్ను అంగీకరింపజేసి నీ శ్రీచరణాల మోల ఉంచే స్వామీ!) అని ఆళ్వార్ల శ్రీసూక్తిని వివరించిన తీరు ఇది.

**16. అనాలోచిత విశేషాశేషలోకశరణ్య! ప్రణతార్తిహర!**

**అనాలోచిత విశేష + అశేష లోక శరణ్య** = జన్మ-వృత్త- జ్ఞానాలలోని తారతమ్యాన్ని చూడకుండా, ఎటువంటి వారైనా తనను సమీపించి ఆశ్రయించేటట్లు వారికి అందటికి రక్షకుడైనవాడా!,

**ప్రణతార్తిహర** = ఆశ్రయించినవారి ఆర్తిని తీర్చేవాడా!

**17. ఆశ్రితవాత్సల్యైకజలధే ! అనవరతవిదితనిఖిల భూతజాతయాథాత్మ్య !**

**ఆశ్రితవాత్సల్య +ఏకజలధే** = ఆశ్రితుల దోషాలను అన్నిటిని గుణాలుగా గ్రహించడమనే వాత్సల్యగుణానికి అద్వితీయ సముద్రంవంటివాడా !

**అనవరత విదితనిఖిలభూత జాతయాథాత్మ్య** = సకలవస్తువులయొక్క వాస్తవతత్త్వాన్ని ఎల్లప్పుడు తెలిసికొనేవాడా !

దీనిద్వారా సర్వజ్ఞత్వం చెప్పబడింది. ఆకించన్యం, అనన్యగతిత్వం మొదలైన నా స్థితులనుగూర్చి నేను విన్నపించనక్కరలేనట్లు నీవే వాటినిగూర్చి తెలిసికొనగల్గినవాడవు కదా - అని భావం.



**18. అశేషచరాచరభూత నిఖిలనియమననిరత! అశేషచిదచిద్వస్తుశేషిభూత!**

**అశేషచరాచరభూత నిఖిలనియమననిరత** = జంగమస్థావరాత్మకమైన సకల పదార్థాలను నియమించడంలో ఎల్లప్పుడు ఆసక్తుడవై ఉండేవాడా !

ఈవిధంగా నన్ను నీ శ్రీచరణాల మోల నిలిచేటట్లు చేసినవాడవుకూడా నీవే - అని భావం.

**అశేషచిదచిద్వస్తుశేషిభూత** = సకలచేతనాచేతనాలకు శేషి అయినవాడా ! (నానుండి కైంకర్యం గ్రహించడం నీ బాధ్యతసుమా! - అని హార్ద భావం)

**19. నిఖిలజగదాధార ! అఖిలజగత్స్వామిన్ ! అస్మత్స్వామిన్! సత్యకామ ! సత్యసఙ్కల్ప ! సకలేతరవిలక్షణ ! అర్థికల్పక ! ఆపత్సఖ ! శ్రీమన్నారాయణ ! అశరణ్యశరణ్య ! అనన్యశరణ స్త్వత్పాదారవిన్దయుగళం శరణమహం ప్రపద్యే ॥**

**నిఖిలజగదాధార** = సకలజగత్తుకు ఆధారమైనవాడా !,

**అఖిలజగత్స్వామిన్** = సకలజగత్తుకు స్వామీ !,

**అస్మత్ స్వామిన్** = విశేషించి నాకు స్వామి అయినవాడా!,

**సత్యకామ** = అవాప్తసమస్తకాముడవైనవాడా !,

**సత్యసంకల్ప** = ఎవరు అడ్డగించడానికి వీలు కాని రీతిలో ఋజువుగా నెరవేఱగల్గిన సంకల్పాలను కలవాడా!

**సకల + ఇతరవిలక్షణ** = తనకంటే వేఱయిన అన్నిటికంటే అన్ని రీతులలో గొప్పతనాన్ని (వైలక్షణ్యాన్ని) కలవాడా!,

**ఆర్థికల్పక** = దీనికి మూడు రీతులలో అర్థం తెలుపబడింది. (1) యాచకులకు కల్పవృక్షంవలె ఉన్నవాడా!, (2) యాచకులను కల్పవృక్షంగా కలవాడా, (3) యాచకుడుగాను, కల్పవృక్షంగాను ఉన్నవాడా! - అని, **"అర్థినః కల్పయతీతి అర్థికల్పకః"** అనే సమాసాన్ని చేయవచ్చు కనుక, అర్థులను కల్పించేవాడు - జనింపచేసేవాడు - అనే నాల్గవ అర్థం కూడా పొసగుతుంది.

**ఆపత్సఖ** = ఆపత్కాలాలలో మిత్రమై ఉన్నవాడా !, (వెంట ఉండేవాడా !),

**శ్రీమన్నారాయణ** = లక్ష్మీనాథుడవైన నారాయణా !

**అశరణ్యశరణ్య** = ఏగతి లేనివారికి గొప్ప గతి అయినవాడా !

అనన్యశరణః అహం త్వత్పాదారవిందయుగళం శరణం ప్రపద్యే = ఏగతి లేని నేను శ్రీచరణపద్మాల వద్ద వేఱు ఏ గతి లేనివాడనై శరణాగతి చేస్తున్నాను.

**20.** అత్ర ద్వయమ్ ॥

(ఇక్కడ ద్వయమంత్రానుసంధానాన్ని చేయాలి. ఈ మంత్రం ఆచార్యోపదేశంవల్ల పొందదగినది కనుక ఇక్కడ ప్రస్తావించబడలేదు.)

**21.** పితరం మాతరం దారాన్ పుత్రాన్ బన్ధూన్ సఖీన్ గురూన్ ।
రత్నాని ధనధాన్యాని క్షేత్రాణి చ గృహాణి చ ॥
సర్వధర్మాంశ్చ సన్త్యజ్య సర్వకామాంశ్చ సాక్షరాన్ ।
**లోకవిక్రాన్తచరణౌ శరణం తేఽవ్రజం విభో! ॥**

ఈ రెండు శ్లోకాలు పౌరాణికాలు. ఇవి ఇక్కడ ఎందుకు ప్రస్తావింపబడ్డాయి? అని అంటే - పూర్వులు పల్కిన అర్థాలే కాక, వారు పల్కిన సూక్తులను శబ్దతః ఈ ప్రకరణంలో విన్నపించడంవల్ల భగవానుని మనస్సులో అనుగ్రహాతిశయాన్ని కల్గిస్తుంది- అనే భావంతోనే. ఈ శ్లోకాలద్వారా శ్రీరామానుజులు మళ్ళీ శరణాగతిని చేస్తున్నారు- అని భావించరాదు. "సకృదేవ హి శాస్త్రార్థః" అని చెప్పబడినందువల్ల శరణాగతిని ఆవృత్తి చేసే అవకాశం లేదు.

**విభో** = ప్రభూ, **పితరం మాతరం దారాన్ బంధూన్ పుత్రాన్ సుఖీన్ గురూన్**= తండ్రిని, తల్లిని, భార్యను, బంధువులను, పుత్రులను, మిత్రులను, గురువులను, **రత్నాని** = రత్నాలను, **ధనధన్యాని** = ధనాన్ని, ధాన్యాన్ని, **క్షేత్రాణి చ** = క్షేత్రాలను, **గృహాణి చ** = గృహాలను, **సర్వధర్మాన్ చ** = అన్ని ధర్మాలను, **సాక్షరాన్ సర్వకామాన్ చ** = కైవల్యంతో పాటుగా అన్ని కోరికలను, (స్వర్గలోకాధిపత్యం, బ్రహ్మలోకాధిపత్యం మొదలైనవానిలోని ఆశను- అని భావం) **సంత్యజ్య** = వాసనతోపాటుగా వదలిపెట్టి, **తే లోకవిక్రాంతచరణౌ** = లోకాలను కొలిచిన నీ శ్రీచరణ యుగ్మాన్ని, **శరణం ప్రపద్యే** = శరణు పొందుతున్నాను.

ఇక్కడ **"దారాన్ పుత్రాన్ బంధూన్ సఖీన్ రత్నాని"** ఇత్యాదులను విడచిపెట్టినట్లు పల్కడంలో విప్రతిపత్తి ఏమీ లేదు. **"పితరం మాతరం గురూన్"**- అని అంటూ తండ్రిని తల్లిని, ఆచార్యులను విడచినట్లు పల్కడం తగునా? **"మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ"** అని వేదం విధిస్తూ ఉండగా, దానిని ఉల్లంఘించడం తగునా? తల్లిదండ్రులను విడువచ్చునా? తల్లిదండ్రులను విడువవచ్చునని ఏదో ఒక విధంగా ఉపపాదించినా, ఆచార్యత్యాగం ఏరీతిలోను సమర్థించే అవకాశం లేదే! **"పంచాచార్యపదాశ్రితః"** అని పొగడబడే భగవద్రామానుజులు తాము ఏ ఆచార్యులను విడచిపెట్టినవారు కారుకదా! అందువల్ల, వాస్తవానికి త్యాజ్యాలైన ధనధాన్యాదులతో పాటుగా త్యజించరాని వాటినికూడా త్యజించినట్లు పల్కడంలో ఏమి సామంజస్యం ఉన్నది? అని కొందఱు ప్రశ్నించవచ్చు. దీనికి సమాధానం ఏమంటే - వీరిని విడువడం అంటే - వారితో విరోధించి పక్కకు గెంటి వేయడమని అర్థం కాదు. కామ్యధర్మోపయోగిగానో, అర్థకామోపయోగిగానో వీరిని గ్రహించకూడదని తాత్పర్యం. **"గృహాణి"** అని గృహాలను విడచినట్లు తెలుపబడింది. గృహం అంటే - వాసస్థానం. సన్యాసులైనా సరే, ఏవాసస్థానం లేకుండా ఆకాశంలో నిలవడం వీలు కాదు కదా! ఏదో ఒక చోటు ఆవశ్యకం కావలసి ఉన్నందున అవర్జనీయం. కనుక దీనినికూడా విడచినట్లుగా పల్కడంలోని భావం గమనించాలి. ఈలోకంలో జీవించి ఉన్నంత వరకు ధనధాన్యాదులను విడచిపెట్టడం సాధ్యమా! పరమైకాంతులై, నేరుగా తామే ధనధాన్యాదులను దాచి పెట్టుకోకున్నా, తమకు ప్రతినిధులుగా కొందఱు అంతరంగశిష్యులను అయినా ఏర్పాటు చేసికోవాలికదా లేకపోతే దేహయాత్రను నిర్వహించే అవకాశం లేనేలేదు. కనుక ఇక్కడ చెప్పబడే త్యాగం సర్వాత్మనా త్యాగం కాదని గ్రహించాలి. **"ధర్మాన్ బంధూన్ సఖీన్"** అనే రీతిలోని కొన్ని విషయాలను సర్వాత్మనా త్యజిస్తే ఏమి లోపం? - అని అంటే, పూర్వం వివరించిన రీతిలో త్యజించరానివాటిని త్యజించినట్లు చెప్పడంలోని ఆంతర్యం గ్రహించదగినదే. **"కొణ్డపెణ్డిర్ తామ్ముతలా క్కూఱుముఱ్ఱార్ కన్మత్తాల్ అణ్డినవరెన్టే అవరై విట్టు త్తొణ్డరుడన్ శేర్క్కుమ్ తిరుమాలై చ్చేరుమెన్టాన్ ఆర్క్కు మితమ్ పార్క్కుమ్ పుకర్ మాఱన్ పణ్డు"** (తిరువాయ్మొర్రి నూఱ్ఱన్దాది-81) (ఎంత తెలివి లేనివారి విషయంలో అయినా హితాన్ని చేయాలని చూచే కీర్తినికల నమ్మాళ్వార్లు 'పూర్వం స్వీకరించిన భార్య మొదలుగా చెప్పబడే బంధువర్గం అంతా కర్మకారణంగా పొందినవారని తలచి, కర్మనిబంధనంగా ఏర్పడిన ఆ బంధువులను విడచి తనను ఆశ్రయించినవారిని తన భక్తులతో చేర్చే శ్రియఃపతిని ఆశ్రయించండి'' అని పలికారు.) అని మణవాళమహామునులు అనుగ్రహించిన రీతిలో ఆళ్వార్లు **"కొణ్డపెణ్డిర్ మక్కళుఱ్ఱార్"** అనే దశకంలో భార్యలను, పుత్రులను విడచిపెట్టినట్లు పల్కడం వాస్తవమే. ఆ ఆళ్వార్లే తరువాతి ఫలశ్రుతి పాశురంలో **"ఆయిరత్తుళ్ ఇవై పత్తుమ్ వల్లార్కళ్ నల్లపదత్తాల్ మనైవాళ్వర్ కొణ్డపెణ్డిర్ మక్కళే"** (వేఱు

పాశురంలో ఈ పది పాశురాలను అభ్యసించగల్గినవారు చక్కని స్థితిలో మంచి భార్యాపుత్రులతో కుటుంబజీవనాన్ని సాగించగలరు) అని పల్కడం గ్రహించాలి. ఒకచోట హేయంగా పల్కిన కుటుంబజీవనాన్ని ఇంకొక చోట ఉపాదేయంగా పలికారు అంటే, త్యాజ్యమని పల్కడంలో కారణం వేఱు; ఉపాదేయం కావడంలో నిబంధనం వేఱు- అని తెలిసికోవడం తగినది కదా! **"గురోరప్యవలిప్తస్య కార్యాంతరమజానతః, ఉత్పథం ప్రతిపన్నస్య సద్యస్త్యాగో విధీయతే"** (గురువైనా, అతడు మదించినవాడై, వేఱు కార్యాన్ని తెలియక అక్రమంలో ప్రవర్తిస్తే, అతనిని కూడా విడచిపెట్టవలసినదేనని విధింపబడినది) ఇత్యాది శాస్త్రాలను పురస్కరించుకొని అర్థనిష్కర్షను చేయాలి. **"తన్కురువిన్ తాళిణైకళ్తన్నిల్ అన్బొన్టిల్లాతార్, అన్బుతన్బాల్ శెయ్దాలుమ్ అమ్బుయకోన్, ఇన్బమికు విణ్ణాడు తానళిక్క వేణ్డియిరాన్ ఆదలాల్ నణ్ణార్+ అవర్కళ్ తిరునాడు"** (తన ఆచార్యుని శ్రీచరణాలలో భక్తిలేనివారు, తన పట్ల భక్తిని కలవారైనా, వారికి శ్రియఃపతి మోక్షాన్ని ప్రసాదించాలని అనుకోడు. అందువల్ల వారు పరమపదాన్ని పొందలేరు.) అని, **"ఞానమనుట్టాన మివై నన్గాకవే యుడైయనాన కురువై యడైన్దక్కాల్ మానిలత్తీర్! తేనార్కమల త్తిరుమామకళ్ కొఴునన్ తానే వైకున్దమ్ తరుమ్"** (జ్ఞానం, అనుష్ఠానం- అనే ఈ రెండు చక్కగా కల్గిన గురువును ఆశ్రయిస్తే, ఓలోకులారా! తేనె నిండుగా ఉండే కమలంలో నివసించే లక్ష్మీదేవికి నాథుడైన భగవానుడు తానే స్వయంగా వైకుంఠాన్ని ప్రసాదిస్తాడు) అని అనుగ్రహించిన రీతిలో ఆచార్యసంబంధమే ముక్తికి మూలకారణమై ఉండగా, అటువంటి ఆచార్య సంబంధాన్ని విడచిపెట్టవలసినదని పల్కుతున్నట్లుగా అర్థాన్ని గ్రహించే అవకాశమే లేదు. మాతాపితరులను, ఆచార్యులను, పుత్రమిత్రాదులను భగవద్విభూతులుగా భావిస్తున్నాను- అనేదే ఇక్కడ పరమతాత్పర్యం. వీరే భగవద్భాగవతానుభవ విరోధులైతే వీరిని సర్వాత్మనా త్యజించడంకూడా తగినదే. ఇంకా ఈ విషయంలో మఱింత వివరాన్ని పెద్దలద్వారా విని గ్రహించాలి.

**22.** త్వ మేవ మాతా చ పితా త్వమేవ త్వమేవ బన్ధుశ్చ గురు స్త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ త్వమేవ సర్వం మమ దేవదేవ ! ॥

దేవదేవ = ఓ దేవదేవా!, మాతా చ త్వ మేవ పితా చ త్వమేవ = తల్లివి నీవే, తండ్రివి నీవే, బంధుశ్చ త్వమేవ గురుశ్చ త్వమేవ = బంధువు నీవే, గురువు నీవే, విద్యా త్వమేవ ద్రవిణం త్వమేవ = జ్ఞానం నీవే, అర్థం నీవే, మమ సర్వం త్వమేవ = నాకు సర్వం నీవే.



**"పెఱ్ఱ తాయ్ నీయే పిఱప్పిత్త తన్దై నీ, మఱ్ఱై యారావారుమ్ నీ పేశిల్"** (కన్నతల్లిని నీవే, జన్మింపజేసిన తండ్రివి నీవే, ఇంకా మిగిలినవారంతా నీవే) అని, **"శేలేయ్ కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్ మేలా త్తాయ్ తన్దైయుమ్ అవరే యిని యావారే"** (చేపలవంటి కన్నులు కల స్త్రీలు, గొప్ప సంపద, మంచి సంతానం, ఇంకా, తల్లి, తండ్రి ఆ భగవానుడే, మిగిలిన బంధువులంతా అతడే) అని గల ఆఴ్వార్ల సూక్తులను ఇక్కడ అనుసంధించాలి. పూర్వం **"పితరం మాతరం దారాన్"** అనే శ్లోకంలో విడిచినట్లుగా చెప్పబడ్డవి అన్నీ భగవానుడే అని ఈ శ్లోకంలో చెప్పబడింది. భగవానుడు ప్రియప్రవర్తకుడు కనుక తల్లిగా, హిత ప్రవర్తకుడు కనుక తండ్రిగా- ఇంకా సకలవిధబంధువులు చేయగల్గిన ఉపకారాలను అన్నిటినీ చేయడంవల్ల బంధువుగా, **"కలైయుమ్ వేదముమ్ నీతినూలుమ్ కఱ్పముమ్ శొఱ్పొరుళ్ తానుమ్ మఱ్ఱై కలైకళుమెల్లామ్ నీర్మైయినాల్"** (కళలను, వేదాలను నీతిశాస్త్రాన్ని, కల్పాన్ని, పదార్థాలను తెలిపే శాస్త్రాలను అన్నిటినీ దయతో) అనుగ్రహించినందువల్ల ఆచార్యునిగా- ఈ విధంగా అన్ని విధాలుగా చెప్పడంలో లోటు లేదు. తిరుమంగైమన్నన్- **"పేయిరుక్కు నెడువెళ్ళమ్ పెరువిశుమ్బిన్ మీతోడి ప్పెరుకు కాలమ్ తాయిరుక్కుమ్ వణ్ణమే ఉమ్మై త్తన్ వయిఱ్ఱిరుత్తి ఉయ్యక్కొణ్డాన్"** (మానవులెవరూ లేని రీతిలో పిశాచాలు మాత్రమే ఉండదగినట్లుగా ఉండే మహాప్రళయంలో ఆకాశంలో పైకి ప్రవహించిన కాలంలో, కన్నతల్లి వలె ప్రేమతో మిమ్ములను తన ఉదరంలో పెట్టుకొని కాపాడినవాడు) అని పల్కిన సూక్తినిబట్టి ఇక్కడ ఈ సందర్భంలో పెరియవాచ్చాన్ పిళ్ళై చూపిన అర్థస్వారస్యాన్ని శ్రీదేశికులు- **"మాతా ప్రళయ దశాయామ్ ఉదరే స్థాపయిత్వా ప్రసవనాత్"** (మాతా-ప్రళయదశలో ఉదరంలో పెట్టుకొని రక్షించి సృష్టికాలంలో ప్రసవించినందువల్ల తల్లి) అని వ్యాఖ్యానించడం గమనించదగినది.

**(త్వమేవ విద్యా) - "నావినుళ్ నిన్ఱు మలరుమ్ ఞానక్కలైకళుక్కెల్లామ్ ఆవియు మాక్కైయుమ్ తానే"** (జిహ్వానుండి వికసించే శాస్త్రాలకు అన్నిటికీ శబ్దార్థాలు రెండూ తానే) అనే తిరువాయ్మొఴి శ్రీసూక్తి ఇక్కడ స్మరణీయం. **"నోఱ్ఱ నోన్బిలేన్ నుణ్ణఱివిలేన్"** (నోచిన నోము లేదు, సూక్ష్మమైన జ్ఞానం లేదు- కర్మయోగం చేయలేదు, జ్ఞానయోగాన్ని చేయలేదు) అని ఉండే అకించనులు ఉపాసనారూప విద్యాస్థానంలో భగవానునే నిలుపుకొంటారని -భావం.

**(ద్రవిణం త్వమేవ)**- "ఉపాయోపేయాలు రెండు నీవే" అని చెప్పిన తీరు ఇది. లోకంలో ద్రవ్యాన్ని కార్యాంతరాలకు సాధనంగా చేసికోవడం, స్వయంభోగ్యంగా గ్రహించడం ప్రత్యక్షసిద్ధం. అది భగద్విషయంలోకూడా పొసగుతుంది.

**23. పితాऽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్ ।**
**న త్వత్సమోऽస్త్యభ్యధికః కుతోऽన్యో లోకత్రయేऽ ప్యప్రతిమప్రభావ!॥**

**అస్య చరాచరస్య లోకస్య త్వమ్ పితా అసి** = (గడచిన శ్లోకంలో భగవానుని తమకు ఒక్కరికే తల్లిగా, తండ్రిగా పలికారు. ఆ సంబంధం సర్వలోకసాధారణం కనుక, దానిని తెలిపే శ్లోకాన్ని ఇపుడు అనుసంధిస్తున్నారు. భగవద్గీతలోని 11వ అధ్యాయంలో 43వ శ్లోకం ఇది. దీని తరువాత శ్లోకంకూడా దీనితో చేర్చి అను సంధింపబడుతున్నది)

**అప్రతిమప్రభావ** = సాటి లేని మేటి వైభవాన్ని కలవాడా!, **త్వమ్ అస్య చరాచరస్య లోకస్య పితా అసి** = స్థావర జంగమాత్మకమైన ఈ లోకానికి అంతటికి తండ్రివై ఉన్నావు, **అస్య లోకస్య పూజ్యః గురుశ్చ అసి** = ఈ లోకానికి పూజింప దగిన ఆచార్యుడవై ఉన్నావు; కనుక, ఈ లోకానికి అంతటికి పూజ్యతముడవు నీవే, **లోకత్రయే అపి త్వత్ సమః అన్యః నాస్తి** = కారుణ్యం మొదలైన గుణాలలో నీతో సమానుడు ముల్లోకాలలోను వేఱొకడు లేడు, **అభ్యధికః కుతః** = సమానుడే లేడు అనినపుడు గొప్పవాడు లేడు అనే విషయం చెప్పాలా! **"ఉపమానోపమే యత్వం యదేకస్యైవ వస్తునః, ఇందురిందురివ శ్రీమానిత్యాదౌ తదనన్వయః"** అని అలంకారిక వచనం. **"గగనం గగనాకారం సాగరః సాగరోపమః, రామ లావణయోర్యుద్ధం రామరావణయోరివ"** ఇత్యాదులు ఉదాహరణలుగా గ్రాహ్యాలు **"ఒత్తార్ మిక్కారై యిలై యాయ మామాయన్"** కదా! (తనకు సాటి అయినవారిని, మించిన వారిని లేని గొప్ప ఆశ్చర్యభూతుడు)

ఇక్కడ **"త్వత్ సమః నాస్తి"** అని అనకుండా **"త్వత్ సమః అన్యః నాస్తి"** అని అన్నందువల్ల నీకు సమానుడవు నీవే- అని భావం. **"తన్నొప్పాన్ తానాయ్ ఉళన్ కాణ్"** (తనకు సాటి అయినవాడు తానై ఉన్నాడు సుమా) అని తిరుమழிశై ప్పిరాన్‌కూడా అన్నారు.

**24. తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్।**
**పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ ! సోఢుమ్ ॥**



**తస్మాత్** = పూర్వశ్లోకంలో చెప్పిన రీతిలో నీవు సర్వస్మాత్పరుడవై ఉన్నందు వల్ల, **అహం** =లోటు పాట్లు మూర్తీభవించినవాడనై ఉండే నేను, **ఈశమ్ ఈడ్యమ్ త్వాం** = సర్వనియంతవుగాను, స్తోత్రార్హుడవుగాను ఉండే నిన్ను, **కాయం ప్రణిధాయ ప్రణమ్య** = (వేఱు తెగిన చెట్టువలె), శరీరాన్ని నేలపై మోపి, సాష్టాంగంగా నమస్కరించి, **ప్రసాదయే** = క్షమను అభ్యర్థిస్తున్నాను, **దేవ** = దేవా!, **పుత్రస్య (దోషం) పితా ఇవ** = పుత్రుని దోషాన్ని తండ్రి క్షమించినట్లు, **సఖ్యుః దోషమ్ సఖా ఇవ** = మిత్రుని అపరాధాన్ని మిత్రుడు సహించినట్టు, **ప్రియాయ (మహ్యమ్)** = ప్రియుడనైన నాపట్ల, **ప్రియః (త్వమ్) సోఢుమ్ అర్హసి** = ప్రియుడవైన నీవు (నా అపరాధాలను) క్షమించు.

**"ప్రియః ప్రియాయార్హసి"** అనేచోట **"ప్రియః ప్రియాయాః అర్హసి"** అనే పదవిభజన చేయవచ్చు. అపుడు జరిగిన సంధిని ఆర్షంగా భావించాలి. ప్రియురాలి యొక్క దోషాన్ని ప్రియుడు సహించినట్లు - అని దీనిభావం.

**25. మనోవాక్కాయై రనాదికాలప్రవృత్తానన్తాకృత్యకరణకృత్యాకరణ భగవద పచార భాగవతాపచారాసహ్యాపచారరూప నానావిధానన్తాపచారాన్ ఆరబ్ధకార్యాన్ అనారబ్ధకార్యాన్ కృతాన్ క్రియమాణాన్ కరిష్యమాణాంశ్చ సర్వానశేషతః క్షమస్వ॥**

**మనోవాక్కాయైః** = మనస్సు, వాక్కు, శరీరం = అనే మూడు కరణాలతో, **అనాదికాలప్రవృత్త** = మొదలు తెలియని నాటినుండి ప్రవృత్తమైన, **అనవరత** = అంతు లేని, **అకృత్యకరణ** = చేయకూడని కార్యాలను చేయడం, **కృత్య +అకరణ**= చేయవలసిన కార్యాలను చేయకపోవడం, **భగవత్+అపచార** = భగవానునిపట్ల అపచారపడడం, **భాగవత+అపచార** = భగవద్భక్తుల విషయంలో అపచారపడడం, **అసహ్య+అపచార** = సహించడానికి సాధ్యం కాని రీతిలో అపచారపడడం- అనే రీతిలోని, **నానావిధ+అనంత+అపచారాన్** = పలు రీతులలోని, అపరిమితాలైన అపచారాలను (దీనికి **"అశేషతః క్షమస్వ"** అనే దానితో అన్వయం) **అశేషతః** = అణువు అంతకూడా శేషించకుండా పూర్తిగా, **క్షమస్వ** = క్షమించు,

ఈ అపచారాలు ఎటువంటివి? అంటే,

**ఆరబ్ధకార్యాన్** = ఫలాన్ని ఇవ్వడం ఆరంభించిన అపచారాలను, **అనారబ్ధ కార్యాన్** = ఇంక ఫలాన్ని ఇవ్వడం ఆరంభించని పాపాలను, **కృతాన్** = గడచిన కాలంలో చేయబడిన పాపాలను, **క్రియమాణాన్** = వర్తమానకాలంలో చేయబడు

తున్న పాపాలను, కరిష్యమాణాన్ చ = భవిష్యత్కాలంలో చేయబడే పాపాలను, (క్షమస్వ = క్షమించు).

**(సర్వాన్)** = లోకంలో వారు వారు చేసే అపచారాలు మానసికాలుగా, వాచికాలుగా, కాయికాలుగా ఉండడం ప్రసిద్ధమై ఉండగా, **"మనోవాక్కాయైః ప్రవృత్త"** అని చెప్పవలసి ఉన్నదా? అని అంటే, భగవానుని చింతించడంకోసం ఉండే మనస్సును, అతనిని స్తుతించడంకోసం ఉండే వాక్కును, అతనికి సేవ చేయడంకోసం ఉండే శరీరాన్ని ఉపయోగించి అయ్యో! దుర్వినియోగ పరుస్తున్నారే! - అనే నిర్వేదం ఈ ప్రయోగం ద్వారా వ్యక్తమవుతున్నది.

ఈ పాపాలు ఎన్నాళ్ళనుండి చేయబడుతున్నవి? - అని అంటే - **"అనాది కాలప్రవృత్తాన్"** అని అంటున్నారు. సంసారం అనాది, **"బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున!"** (అర్జునా! నాకు నీకు కూడా జన్మలు అనేకం గడిచాయి) అని గీతలో పల్కిన రీతిలో పూర్వం గడచిన జన్మలకు ఒక లెక్క లేదు. ఈ విధంగా ఆది తెలియని కాలంనుండి ప్రవృత్తమైనవి. అందువల్లనే అవి అనంతాలు. వాటిని **"అకృత్యకరణ"** ఇత్యాదిగా విభజించి పల్కుతున్నారు.

అకృత్యకరణ - మంటే చేయకూడనివిగా శాస్త్రాలలో చెప్పబడిన దుష్కర్మలను చేయడం. **"న హింస్యాత్ సర్వా భూతాని"** అనే వేదవిధిని అతిక్రమించి జీవులకు బాధను కల్గించడం, ప్రాప్త విషయాలను స్తుతించవలసిన వాక్కుతో తగని విషయాలను స్తుతించడం, ఇతరుల సొత్తు, భార్యలు మొదలైన వానిని అపహరించడం, అబద్ధాలు పల్కడం, తినకూడదని వస్తువులను ఇష్టం వచ్చినట్లుగా తినడం - మొదలైన రీతిలో అనేక విధాలుగా అకృత్య కరణాలు ఉంటాయి.

కృత్యాకరణ మంటే - శాస్త్రాలలో విధింపబడిన వర్ణాశ్రమధర్మాలను సోమరితనంవల్ల, విసుగువల్ల, నాస్తిక్యంవల్ల అనుష్ఠించకుండా విడిచివేడయం. భగవతారమంటే - భగవానుడైన శ్రీమన్నారాయణుని ఇతర దేవతలతో సమానంగా భావించడం, రామకృష్ణాది భగవదవతారాలను మానవసజాతీయాలుగా భావించడం, అర్చామూర్తుల ఉపాదానంలో - అంటే - అది నిర్మింపబడ్డ ద్రవ్యాన్ని గూర్చి పరిశీలించడం మొదలైనది. భాగవతాపచారమంటే - అహంకారంతోను, అర్థకామాలను దృష్టిలో పెట్టుకొని భగవద్భక్తులను ద్వేషించడం, అసహ్యాపచార మంటే - పూర్వం తెల్పిన రీతిలో అర్థకామాదులైన హేతువులు లేకుండానే, హిరణ్యకశిపునివలె భగవానుని, భాగవతులను చూచినా, వినినా సహించలేకపోవడం



ఆచార్యుల పట్ల చేసే అపచారం అసహ్యాపచార మనబడుతుంది. అంటే - ఆచార్యుడు ఉపదేశించిన అర్థాలను అల్పప్రయోజనాలకోసం అధికారం యోగ్యత లేనివారికి ఉపదేశించడం ఇత్యాదులు. ఆచార్య భక్తులైన సబ్రహ్మచారులతో కలసి వర్తించవలసి ఉండగా, ఆ విధంగా ఉండకుండా, వారి సామర్థ్యాన్ని చూచి అసూయ పడడం, వారిని అవమానించడం మొదలైనవి. అసహ్యాపచారాలు **"భాగవతభక్త విషయాపచారః అసహ్యాపచారః"** (భాగవత భక్తుల విషయంలో చేసే అపచారం అసహ్యాపచారం) అని శ్రీశ్రుతప్రకాశికాచార్యులవారి వివరణం. వారు తమ వ్యాఖ్యలో భగవదపచారాన్ని వివరించిన తీరు చాలా అందమైనది. **"భగవదపచారో భాగవతాపచారః, భాగవతాపచారో భగవదపచారః"** అని వారి సూక్తి. భాగవతుల పట్ల చేసిన అపచారం భగవదావచారంగా పర్యవసిస్తుంది. **"పాండవాన్ ద్విషసే రాజన్! మమ ప్రాణా హి పాండవాః"** అనే భగవానుని సూక్తిని, **"యదపరాధ సహప్రమజప్రజం త్వయి శరణ్య! హిరణ్య ఉపావహత్, వరద! తేన చిరం త్వమవిక్రియో వికృతి మర్భకనిర్భజనాదగాః"** అనే కూరేశుల సూక్తి స్మరణీయాలు.

భగవానుని ఉద్దేశించి పలికే ఈ చూర్ణికలో **"త్వదపచార"** అని ప్రత్యక్షంగా మధ్యపురుషలో చెప్పవలసి ఉండగా, **"భగవదపచార"** అని పరోక్షంగా పల్కడం తగునా? అని సందేహించవచ్చు. ఈ విధంగా పల్కినా లోటు లేదు. భగవదపచారమనే ప్రసిద్ధి ప్రాచుర్యాన్ని పొందినందువల్ల ఈ విధంగా ప్రయోగింపబడింది. **"త్వదపచారేతి వక్తవ్యేపి అత్ర భగవదపచారశబ్దః తత్త్రప్రమాణోపాత్తప్రకార సూచనార్థః"** అని వేదాంతదేశికసూక్తి. ఈ చూర్ణికలో **"అనంత"** అనే పదం రెండు మార్లు ప్రయోగింపబడింది. మొదట గల అనంతశబ్దం అకృత్యకరణ- కృత్యాకరణ రూప సామాన్యాపచారాలలో అన్వయిస్తుంది. రెండవ పదం భగవదపచారాలలో అన్వయిస్తుంది.

**(ఆరబ్ధకార్యాన్ అనారబ్ధకార్యాన్)** - ప్రారబ్ధకర్మలని, సంచితకర్మలని కర్మలు రెండు విధాలు. మనం చేసే కర్మలు అప్పటికప్పుడే ఫలించవు. పరిణామ క్రమంలోనే ఫలాన్ని ఇస్తాయి. ఆ రీతిలో ఫలాన్ని ఇవ్వడం ఆరంభించిన కర్మలు ప్రారబ్ధకర్మలు. అవి ప్రకృతంలో **"ఆరబ్ధకార్యాన్"** అని తెలుపబడ్డాయి. అటువంటి ప్రారబ్ధకర్మలచేత అడ్డగింపబడినవై, ఇంకా ఫలాన్ని ఇవ్వడం ఆరంభం కాని కర్మలు సంచితకర్మలు. అవి ఇక్కడ **"అనారబ్ధకార్యాన్"** అని నిర్దేశించబడ్డాయి.

**26.** అనాదికాలప్రవృత్తం విపరీతజ్ఞాన మాత్మవిషయం, కృత్స్నజగద్విషయం చ విపరీతవృత్తంచాశేషవిషయమద్యాపి వర్తమానం వర్తిష్యమాణం చ సర్వం క్షమస్వ॥

ఇక, మోక్షవిరోధులైన పుణ్యాపాపరూపాలైన ప్రతిబంధకాలను క్షమించాలని వేడుతున్నారు.

**అనాదికాలప్రవృత్తం** = ఆది తెలియని కాలంనుండి ఆరంభమైనవి, **ఆత్మ విషయం కృత్స్నజగద్విషయం చ విపరీతజ్ఞానం** = ఆత్మకు చెందినది, సమస్త జగత్తును గూర్చినది అయిన విపరీతజ్ఞానాన్ని (క్షమించాలి), **అశేషవిషయం** = అన్నిటిని విషయంగా కల్గినది, **అద్యాపి వర్తమానం** = ఇంకా ఈనాటికీ అనువర్తించి ఉన్నది, **వర్తిష్యమాణం చ** = ఇకపైకూడా వాసనాబలంవల్ల సంభవించబోయేది, **సర్వం చ విపరీతవృత్తం క్షమస్వ** = సర్వమైన నిషిద్ధానుష్ఠానాన్ని క్షమించాలి. ఆత్మవిషయంలోని విపరీతజ్ఞానం అంటే - దేహాత్మాభిమానం, స్వతంత్రాత్మభ్రమ, అన్యశేషత్వభ్రాంతి ఇత్యాదులు. కృత్స్నజగద్విషయమైన విపరీతజ్ఞానం అంటే- **"సర్వభూతాత్మికే తాత ! జగన్నాథే జగన్మయే, పరమాత్మని గోవిందే మిత్రామిత్రకథా కుతః"** (నాయనా! సర్వభూతాత్మకుడు, జగన్నాథుడు, జగద్రూపుడు, పరమాత్మ అయిన గోవిందుడుండగా, ఇక మిత్రులనే - శత్రువులనే ప్రసక్తి ఎక్కడ ఉన్నది) అనే ప్రహ్లాదుని క్రమంలో కాకుండా దేవతిర్యక్ మనుష్యాది పదార్థాలను తావన్మాత్రంగా తెలిసికోవడం. **"ఆత్మవిషయం, కృత్స్న జగద్విషయమ్"** అనే విశేషణాలు **"విపరీతవృత్తమ్"** అనే విశేష్యంలో కూడా అన్వయిస్తాయి. ఆత్మవిషయమైన విపరీతవృత్తం అంటే - స్వరక్షణే స్వాన్వయం మొదలైనవి. జగద్విషయమైన విపరీతవృత్తం అంటే - తనపట్ల ఒకడు హానిచేస్తే దానిని తన కర్మఫలంగానో, కృపాఫలంగానో భావించకుండా, దానిని నిమిత్తమాత్రుడైన చేతనుని స్వతంత్రునిగా భావించి, "అతడు నాకు హాని చేశాడు'' అని తలచి, అతనిపట్ల ఒకటికి పదిరెట్లు అపకారాలను చేయడం. **"విశేషవిషయమ్"** -ఐశ్వర్యం మొదలైన పురుషార్థాలనుకోరడం- ఇత్యాది కామ్యాలు వివక్షితాలు. పూర్వం చేసినవానిని, ఇపుడు చేసేవానిని, ఇకపై చేయబోయేవానిని అన్నిటినీ జ్ఞానహీనుడనైన నేను తెలియకపోయినా, సర్వజ్ఞుడవైన నీవే వాటిని తెలిసి క్షమించాలి-అని ప్రార్థిస్తున్నారు.

**27.** మదీయానాది కర్మప్రవాహప్రవృత్తాం, భగవత్స్వరూప తిరోధానకరీం, విపరీత జ్ఞానజననీం, స్వవిషయాయాశ్చ భోగ్యబుద్ధేర్జననీం, దేహేన్ద్రియత్వేన భోగ్యత్వేన



సూక్ష్మరూపేణ చావస్థితాం, దైవీం గుణమయీం మాయాం, దాసభూతం "శరణా గతోఽస్మి తవాస్మి దాసః" ఇతి వక్తారం మాం తారయ ॥

పూర్వం తెల్పిన అజ్ఞానానికి మూలకారణమైన దేహసంబంధాన్ని పోగొట్టాలి- అని ఈ చూర్ణికలో ప్రార్థిస్తున్నారు. భగవానుడు గీతలో **"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా, మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే"** (త్రిగుణాత్మకమైన, నాకు క్రీడాపరికరమైన, మాయాశబ్దవాచ్య అయిన ఈ ప్రకృతి ఎవరికీ దాటరానిది. నన్ను ఎవరు ఆశ్రయిస్తారో, వారే ఈ మాయను దాటుతున్నారు) అని పలికాడుకదా. దానిని ఉద్దేశించి ఇక్కడ **"మామ్ తారయ"** అని పలికారు. మాయ అంటే- ప్రకృతి. దానిని దాటినవాడను (పోగొట్టు కొన్నవాడను) అయినట్లుగా నన్ను అనుగ్రహించాలి - అని అంటున్నారు.

**మదీయ+అనాది కర్మ ప్రవాహప్రవృత్తాం** = చిరకాలంగా నేను చేస్తూ వచ్చిన కర్మపరంపరలచే ఏర్పడినది, **భగవత్స్వరూప తిరోధానకరీం** = భగవానుని స్వరూపాన్ని తెలిసికోనీయకుండా మఱుగుపరచేది, **విపరీతజ్ఞాన జననీం** = దేహాత్మ భ్రమ మొదలైన విపరీతజ్ఞానాలను కల్గించేది, **స్వవిషయాయాః భోగ్యబుద్ధేః చ జననీం** = స్వకార్యరూపమైన శబ్దాదివిషయాలలో భోగ్యబుద్ధిని కల్గించేది, **దేహేంద్రియత్వేన భోగ్యత్వేన సూక్ష్మరూపేణ చ అవస్థితామ్** = భోగస్థానమైన దేహరూపంతోను, భోగోపకరణమైన ఇంద్రియరూపంతోను, భోగ్యమైన శబ్దాది రూపంతోను - వీటికి అన్నిటికి మూలకారణమైన సూక్ష్మ ప్రకృతిరూపంతోను (ఈ విధంగా నాల్గు విధాలైన పరిణామాలను కల్గినదై ఉండే), **దైవీం** = **"ఇన్బుఱుమివ్విళైయాట్టుడైయాన్"** (ఆనందం కల్గించే ఈ లీలలను కలవాడు) కనుక దేవుడనే పేరును కల నీచే క్రీడాపరికరంగా గ్రహింపబడిన, **గుణమయీం**= సత్త్వరజస్తమోగుణ రూపమైన, **మాయామ్** = విచిత్రకార్యకరం కనుక మాయ అనే పేరును పొందిన ప్రకృతిని, (దీనికి **"మామ్ తారయ"** అనే దానితో అన్వయం)

**"దాసభూతమ్"** అని, **"శరణాగతోఽస్మి దాస ఇతి వక్తారమ్"** అని అంటూ, **"మామ్"** అనే విశేష్యానికి రెండు విశేషణాలు ప్రయోగిస్తున్నారు.

**దాసభూతం** = దాసునిగాను, **శరణాగతః+అస్మి ఇతి వక్తారం** = ద్వయం పూర్వఖండంలోని క్రమంలో శరణాగతుడను అని, ఉత్తరఖండంలో చెప్పబడ్డ రీతిలో కైంకర్యనిష్ఠుడను- అని నోఱు తెఱచి చెబుతున్న, **మామ్**= నన్ను, **తారయ** = (ప్రకృతిని) దాటినవాడనుగా చేయాలి.

"మాయాం మాం తారయ" అనేది ద్వికర్మకప్రయోగం."తవాస్మి దాసః" అనేచోట గల "అస్మి" అనేది ప్రార్థనాభిప్రాయంతో ప్రయోగింపబడినదని గ్రహించాలి. దాసవృత్తినిరతుడనై ఉంటాను- అని భావం. ఈ విధంగా అర్థం చెప్పకపోతే పూర్వం "దాసభూతమ్" అనేదానినే తిరిగి చెప్పినట్లు అవుతుంది, అంతే- అని శ్రీదేశికుల అభిప్రాయం.

ఇకపై చతుర్థీవిభక్తియొక్క అర్థమైన ఇష్టప్రాప్తినిగూర్చి ప్రార్థిస్తున్నారు.

**28.** **తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।**
**ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః ॥**
**ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్ ।**
**అస్థిత స్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥**
**బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।**
**వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥**

**ఇతి శ్లోకత్రయోదిత జ్ఞానినం మాం కురుష్వ ।**

నమశ్శబ్దార్థమైన విరోధినిరసనాన్నిగూర్చి పూర్వం ప్రార్థించారు. తావన్మాత్రంలో నిలవడం సాధ్యమా! పరమపురుషార్థమైన కైంకర్యసిద్ధికూడా కావాలికదా ! కనుక ఆ కైంకర్యాన్ని ప్రార్థించాలని తలచి, దానికి ఆవశ్యకమైనవి, కైంకర్యంవలెనే ప్రియవిషయాలై, పరమపదంలోకూడా అనువర్తించేవి అయిన పరభక్తి-పరజ్ఞాన- పరమభక్తులను అపేక్షించాలని తలచి, భక్తిరూపాపన్నమైన జ్ఞానాన్ని కల్గినవారికే ఇవి సిద్ధిస్తాయి కనుక, ఆ జ్ఞానం కలగాలని, గీతాచార్యుడు అనుగ్రహించిన మూడు శ్లోకాలను పురస్కరించుకొని, ఆ జ్ఞానాన్ని కల్గించాలని ప్రార్థిస్తున్నారు. భగవద్గీతలోని ఏడవ అధ్యాయంలో 17వ, 18వ, 19వ శ్లోకాలను క్రమంగా అనుసంధించి, ఈ మూడు శ్లోకాలవల్ల తేలిన జ్ఞానాన్ని కలవాడను అయినట్లుగా నన్ను అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నారు.

ఈ మూడు శ్లోకాలకు క్రమంగా అర్థం వివరింపబడుతున్నది.

గడచిన (గీతా) శ్లోకంలో **"చతుర్విధా భజంతే మామ్"** అని ప్రారంభించి తనను పూజించేవారు నాల్గు విధాలుగా ఉంటారు- అని శ్రీకృష్ణుడు పలికాడు. భ్రష్టైశ్వర్యకాముడు, అపూర్వైశ్వర్యకాముడు, ఆత్మానుభవమనబడే కైవల్యాన్ని



కోరేవాడు, భగవదనుభవమనే పరమపురుషార్థాన్ని కోరేవాడు- అని నల్గురుగా చెప్పబడినా, ఐశ్వర్యకాములు ఇద్దఱు ఒకే వర్గానికి చెందినవారు కనుక, పురుషార్థకాములు మూడు విధాలుగా చెప్పబడ్డారు. మూడు విధాలైన భక్తులలో జ్ఞాని చాలా గొప్పవాడని చెప్పబడింది. **"తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తిః విశిష్యతే"** అని.

**తేషాం** = ఆ ముగ్గురిలో, **జ్ఞానీ విశిష్యతే** = జ్ఞాని విశేషింపబడుతున్నాడు. ఆ వైలక్షణ్యానికి ఏమి కారణం ? అంటే, **నిత్యయుక్తః ఏకభక్తిః** = నిత్యాయుక్తుడై, ఏకభక్తిగా అతడు ఉండడంవల్ల.

**"జ్ఞానినః అత్యర్థం ప్రియః అహమ్"** - జ్ఞానికి నాపట్ల గల ప్రీతి వాచామ గోచరం - అని భావం. **స చ మమ ప్రియః** ఆ రీతిలోనే ఆ జ్ఞానిపట్ల నాకు గల ప్రీతికూడా వాచామగోచరమే. **ఏతే సర్వే ఏవ ఉదారాః** = పూర్వం తెల్పిన అధికారులు అందఱు నిన్నే ఉపాసిస్తున్నందువల్ల వారు ఔదార్యాన్ని కలవారు. నావద్దనుండి ఏదో ఒక పురుషార్థాన్ని అయినా గ్రహించేవారిని నేను సర్వస్వదాతలుగా భావిస్తాను- అని భావం. **"జ్ఞానీ తు ఆత్మైవ మే మతమ్"** (జ్ఞాని అయితే నా ఆత్మయే అని నామతం) అయినా వారిలో జ్ఞానినే నాప్రాణంగా నేను తలుస్తాను- అని భావం. ఎందుకు? అంటే, **స హి యుక్తాత్మా మామ్ ఏవ అనుత్తమాం గతిమ్ ఆస్థితః** = నాతో కలిసి సదా ఉండాలి - అని భావించే ఆ అధికారి నన్నే గొప్ప ప్రాప్యంగా భావించడంవల్ల - అని భావం. **బహూనాం జన్మనామ్ అంతే** -అనే రాబోయే శ్లోకంలోకూడా జ్ఞానియొక్క గొప్పతనమే చెప్పబడుతున్నది) **బహూనాం జన్మనామ్ అంతే** = పలు పలు జన్మలు గడచిన పిదప, **జ్ఞానవాన్ సన్** = నాకు శేషమై ఉండడమే ఆత్మస్వరూపమని తెలిసినవాడై, **మామ్ ప్రపద్యతే** = జ్ఞాని అయినవాడు నన్ను సేవిస్తున్నాడు. ఏవిధంగా సేవిస్తున్నాడు? అని అంటే, **వాసుదేవః సర్వమ్ ఇతి** = **"ఉణ్ణుమ్ శోఱు పరుకు నీర్ తిణ్ణుమ్ వెఱ్ఱిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్"** (భుజించే అన్నం, తాగేనీరు, అనుభవించే తాంబూలం అంతా- ధారక, పోషక, భోగ్యాలు అన్నీ- శ్రీకృష్ణుడే) అనే ప్రతిపత్తితో సేవిస్తున్నాడు. **సః మహాత్మా సుదుర్లభః** = అటువంటి మహాత్ముడు నాకు దొరకడం అరుదు.

ఈ విధంగా ఈ మూడు శ్లోకాలలోను గొప్పగా తెలుపబడ్డ జ్ఞానినిగా నన్ను చేయాలి- అని ప్రార్థించినట్లయినది.

29. పురుష స్స పరః పార్థ ! భక్త్యా లభ్యస్త్వనన్యయా ।
భక్త్యా త్వనన్యయా శక్యః ।
మద్భక్తిం లభతే పరామ్ ।
ఇతి స్థానత్రయోదిత పరభక్తియుక్తం మాం కురుష్వ ।

"పురుషః స పరః పార్థ" అనే శ్లోకం గీతలోని ఎనిమిదవ అధ్యాయంలో 22వ శ్లోకం. "భక్త్యా త్వనన్యయా శక్యః" అనే శ్లోకం 16వ అధ్యాయంలో 54వ శ్లోకం. "మద్భక్తిం లభతే పరామ్" అనేది 18వ అధ్యాయంలో 54వ శ్లోకం. ఈ విధంగా ఈ మూడు శ్లోకాలలోను చెప్పబడిన పరభక్తిని దాసుడనైన నాకు కలిగే టట్లుగా అనుగ్రహించాలి- అని ప్రార్థిస్తున్నారు.

పరభక్తి పరజ్ఞాన పరమభక్త్యైకస్వభావం మాం కురుష్వ ॥

పరభక్తి కలుగగానే పర్యాప్తి (తృప్తి) కలుగదు కదా. పరభక్తి-పరజ్ఞానం-పరమభక్తి- అనే ఈ మూడు మూర్తీభవించినవానినిగా నన్ను చేయాలని భావం.

30. పరభక్తి పరజ్ఞాన పరమభక్తికృత పరిపూర్ణానవరత నిత్యవిశదతమానన్య ప్రయోజనానవధికాతిశయప్రియ భగవదనుభవోఽహం, తథావిధ భగవదనుభవ జనితానవధికాతిశయ ప్రీతికారితాశేషావస్థోచితాశేషశేషతైక రతిరూప నిత్యకింకరో భవాని ॥

ఈ చూర్ణికలో నిత్యానుభవాన్ని, నిత్యకైంకర్యాన్ని పొందాలని ప్రార్థింపబడు తున్నది. ఈ చూర్ణికలోని పదాలే తరువాతి చూర్ణికలో ఉన్నందువల్ల, వీటి అర్థాన్ని అక్కడ వివరణలో చూడవచ్చు.

31. ఏవమ్భూత మత్కైఙ్కర్యప్రాప్త్యుపాయతయాఽవక్లృప్త సమస్తవస్తువిహీనోఽపి, అనన్తమదపచార యుక్తోఽపి, అనన్తమదీయాపచారయుక్తోపి, అనన్తాసహ్యాపచార యుక్తోఽపి, ఏతత్కార్యకారణభూతానాది విపరీతాహంకార విమూఢాత్మస్వభావోఽపి, ఏతదుభయకార్య కారణభూతానాది విపరీతవాసనాసమ్బద్ధోఽపి, ఏతదనుగుణ ప్రకృతి విశేషసమ్బద్ధోఽపి, ఏతన్మూలాధ్యాత్మికాధిభౌతికాధిదైవిక సుఖదుఃఖతద్ధేతు తదితరోపేక్షణీయ విషయానుభవజ్ఞాన సఙ్కోచరూప మచ్చరణారవిన్దయుగళైకాన్తిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తి విఘ్నప్రతిహతోఽపి, యేన కేనాపి ప్రకారేణ ద్వయవక్తా త్వం కేవలం మదీయయైవ దయయా నిశ్శేషవినష్ట సహేతుకమచ్చరణారవిన్ద యుగళైకాన్తికాత్యన్తిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తిః, మత్ప్రసాదలబ్ధ మచ్చరణారవిన్ద-



యుగళైకాత్యన్తిక పరభక్తిపరజ్ఞానపరమభక్తిః, మత్ప్రసాదాదేవ సాక్షాత్కృత యథావస్థిత మత్స్వరూపరూప గుణవిభూతిలీలోపకరణవిస్తారః అపరోక్షసిద్ధమన్నియామ్యతా మద్దాస్యైకస్వభావాత్మస్వరూపః, మదేకానుభవః, మద్దాస్యైకప్రియః, పరిపూర్ణానవరత నిత్యవిశదతమానన్యప్రయోజనానవధి కాతిశయప్రియ మదను భవస్త్వమ్ తథావిధ మదనుభవజనితానవధికాతిశయ ప్రీతికారితాశేషావస్థో చితాశేష శేషతైకరతిరూపనిత్యకిఙ్కరో భవ ॥

ఇకపై ఈ గద్యం పూర్తివరకు భగవానుని ప్రతివచన (సమాధాన) ప్రకారం తెలుపబడుతున్నది.

ఏవంభూత మత్కైంకర్యప్రాప్త్యుపాయతయా అవక్లృప్త సమస్తవస్తు విహీనః అపి = (ఈచూర్ణికలో నడుమ "త్వం కేవలం మదీయయైవ దయయా" అనే చోట గల "త్వమ్" అనే పదాన్ని మొదట అన్వయించుకోవాలి) శ్రీరామానుజులను ఉద్దేశించి శ్రీరంగనాథుడు పల్కిన సమాధానం ఇది. పూర్వచూర్ణికలో "నిత్యకింకరో భవాని" అని ప్రార్థించినదానికి అనుగుణంగా "ఆ విధంగానే నిత్యకింకరులు కాగలరు'' అని అనుగ్రహింపబడుతున్నది. ఈ చూర్ణికలో. "ఏవంభూత" అనేది కైంకర్యానికి విశేషణం. గడచిన చూర్ణికలో ఎటువంటి కైంకర్యం ప్రార్థింపబడిందో అది ఈ పదంచేత అనువదింపబడుతున్నది. నీవు కోరిన రీతిలోనే కైంకర్యాన్ని పొందడానికి శాస్త్రాలలో ఏ అనుష్ఠాలు చెప్పబడ్డాయో, ఆ అనుష్ఠానాలు ఏవీ నీకు లేకపోయినా- అని భావం.

అనంతతద్విరోధిపాప+ఆక్రాంతః+అపి = అటువంటి ఉపాయానుష్ఠానాలను ఇకపై సంపాదించుకోలేని రీతిలో వాటికి విరోధాలైన, అపరిమితాలైన పాపాలను మెండుగా నిండుగా కలవారైనా,

అనంతమదపచారయుక్తః +అపి = నాపట్ల చేసిన అపచారాలు అపరిమితంగా కల్గినవారై ఉన్నా,

అనంతమదీయ + అపచారయుక్తః+ అపి = అపరిమితాలైన భాగవతాప చారాలు మెండుగా కలవారైనా, ("మదీయ" - అంటే నాకు చెందినవారు- భాగవతులు అని అర్థం)

అనంత+అసహ్య +అపచారయుక్తః+అపి = అపరిమితాలైన అసహ్యాపచారాలను నిండుగా కలవారైనా,

**ఏతత్ కార్యకరణభూత+ అనాది విపరీత+ అహంకార విమూఢ+ ఆత్మస్వభావః + అపి** = ఇటువంటి అపచారాలవల్ల కలిగేది, వీటిని ఇంకా ఇంకా కల్గించేది, అనాది అయిన విపరీతాహంకారంచేత ఆవరింపబడిన (కప్పబడిన) ఆత్మస్వరూపాన్ని తెలిసికోలేనివారైనా,

**ఏతత్+మూల.....ప్రతిహతః+అపి** = పూర్వం పల్కిన ప్రకృతిమూలంగా ఏర్పడే, తాపత్రయమనబడే సుఖదుఃఖాలు, వాటికి హేతువులు, ఆ సుఖదుః ఖాలకంటే వేఱయిన, ఉపేక్షించదగిన విషయాలు, వీటి అనుభవం, జ్ఞానసంకోచం-అనే రూపంలోని నా శ్రీచరణయుగ్మాన్ని గూర్చిన పరిపూర్ణమైన పరభక్తి, పరజ్ఞాన పరభక్తుల ప్రతిబంధకాలచేత హానిని పొందినవారైనా,

**యేన కేనాపి ప్రకారేణ ద్వయవక్తా త్వం** = ఏదో ఒక రీతిలో ద్వయమంత్రాన్ని అనుసంధించిన మీరు,

**కేవలం మదీయయా+ఏవ దయయా** = నా నిర్హేతుక కృపచేతనే,

**నిశ్శేషవినష్ట....విఘ్నః** = నా శ్రీచరణపద్మయుగ్మాన్నిగూర్చిన పరభక్తి - పరజ్ఞాన - పరమభక్తుల విషయంలోని ప్రతిబంధకాలు అన్నీ నిర్మూలంగా, సకారణంగా, పూర్తిగా తీరినవారై,

**మత్....పరమభక్తిః** = నా శ్రీచరణపద్మయుగ్మాన్నిగూర్చిన పరభక్తి- పరజ్ఞాన-పరమభక్తులను నా అనుగ్రహం మూలంగా యథాతథంగా సాక్షాత్కరించుకొన్నవారై,

**మత్ప్రసాదాదేవ** =నా అనుగ్రహంవల్లనే,

**సాక్షాత్కృత... విస్తారః** = నా స్వరూపం, రూపం, కల్యాణగుణాలు, నిత్యవిభూతి, లీలావిభూతి- అనే వీటి విస్తృతిని యథాతథంగా సాక్షాత్కరించుకొన్నవారై)

**అపరోక్షసిద్ధ.... స్వరూపః** - నాకు మాత్రమే నియమించడానికి సాధ్యమై, నాకే శేషమై ఉండే సహజమైన ఆత్మస్వరూపాన్ని యథాతథంగా తెలిసినవారై,

**మదేకానుభవః** = నన్ను ఒక్కనిమాత్రమే అనుభవించాలని కోరేవారై,

**మద్దాస్యైకప్రియః** = నాకు కైంకర్యం చేయడంలోమాత్రమే ఆసక్తిని కలవారై,



**పరిపూర్ణానవరత... అనుభవః త్వమ్** = పరిపూర్ణమై, నిరంతరమై, ఎల్లప్పుడు మిక్కిలి విశదమై, ప్రయోజనాంతరంయొక్క సంబంధం ఏమాత్రం లేనిదై, పరమప్రియమై ఉండే నా అనుభవాన్ని కలవారైన మీరు,

**తథావిధ.... కింకరో భవ** = అటువంటి నా అనుభవంచేత కల్గించబడిన, మిక్కిలి గొప్పదైన ఆనందంచేత చేయబడే, సర్వావస్థలకు తగిన సకల కైంకర్యాల లోను ఆశను కల్గి ఉండే దాసులుగా మీరు కాగలరు- అని భావం.

ఈ చూర్ణికలోని తాత్పర్యం ఏమంటే - నాకు నిత్యకైంకర్యాన్ని చేసి ఆనందించాలనే ఆశను కల్గిన మీరు దానికి తగిన ఏ ఉపాయంలోను అన్వయం లేనివారైనా, ఆ ఉపాయం ఇకపై నిష్పన్నం కాలేని రీతిలో విరోధులైన పాపాలు నిండుగా ఉన్నవారైనా, భగవదపచార- భాగవతాపచార- అసహ్యాపచారాలు నిండుగా కలవారైనా, పరభక్తి-పరజ్ఞాన- పరభక్తులు కల్గడానికి తగిన విరోధులు మీకు పలు మెండుగా ఉన్నా, మీరు ఆర్తప్రపన్నులుగానో, దృప్తప్రపన్నులుగానో ద్వయమంత్రాన్ని అనుసంధించారు కనుక, నా నిర్హేతుక కృపవల్లనే ఆటంకాలు అన్నీ తొలగి, పరభక్తి-పరజ్ఞాన- పరమభక్తులను పుష్కలంగా పొంది, నా స్వరూప- రూప-గుణవిభూతులను సాక్షాత్కరించుకొని, మీ స్వరూపాన్ని చక్కగా గ్రహించి, నన్నే అనువర్తించేవారై, నాకే కైంకర్యాన్ని చేసేవారై ఉజ్జీవించగలరు- అని భగవానుడు అనుగ్రహించిన రీతిని గూర్చి అనుగ్రహించారు.

**32.** ఏవమ్భూతోఽసి ॥

**ఏవం భూతః+అసి** = ఇది కూడా భగవానుని శ్రీసూక్తియే. పూర్వం నేను అనుగ్రహించిన రీతిలోనే మీరు కావడం ఆరంభించారు- అని భావం. **"ఏవం భవితుం ఉపక్రాంతోఽసి ఇత్యర్థః"** అనేది ఇక్కడ దేశికుల భాష్యసూక్తి.

**33.** ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవిక దుఃఖవిఘ్నగన్ధరహితస్త్వం ద్వయమర్థాను సన్ధానేన సహ సదైవం వక్తా యావచ్ఛరీరపాతమ్ అత్రైవ శ్రీరఙ్గే సుఖమాస్వ ॥

**"ఆఱ్ఱఙ్కరై వాழ் మరమ్ పోల్ అఞ్జుకిన్ఱేన్"** (ప్రవాహతీరంలో ఉండే కూలిపోయే వృక్షంవలె భయపడుతున్నాను) అని, **"ఇరుపాడెరికొళ్ళియినుళ్ ఎఱుమ్బేపోల్ ఉరుకా నిఱ్కుమ్ ఎన్నుళ్ళమ్"** (రెండు వైపుల మండే కొఱివికట్టె మధ్యలోని చీమలవలె నా మనస్సు ద్రవిస్తున్నది. తపిస్తున్నది) అని, **"వెళ్ళత్తిడై ప్పట్ట నరియినమ్పోలే ఉళ్ళమ్ తుళఙ్గానిఱ్పన్"** (ప్రవాహవేగంలో చిక్కుకొన్న నక్కల గుంపువలె నేను మనస్సులో తల్లడిల్లుతున్నాను) అని భయపడనక్కరలేని

రీతిలోని ఈ అజ్ఞానతమోమయమైన లోకంలో నిరపాయంగా కాలక్షేపాన్ని చేసే దారి ఏది ? అనే సందేహానికి పరిహారంగా ఈ చూర్ణిక భగవానుని శ్రీసూక్తిరూపంలో అవతరించింది.

తాపత్రయంవల్ల కల్గిన దుఃఖమనే ఆటంకం కొంచెంకూడా లేనివారై అర్థానుసంధానపూర్వకంగా ఎల్లప్పుడు ఈ విధంగానే అనుసంధిస్తున్నవారై, ఈ శరీరం పతనం చెందేవరకు ఈ శ్రీరంగదివ్యాలయంలో ఆనందమయ జీవితాన్ని గడపగలరు- అని భగవానుడు నోటు తెఱచి పలికాడు. ఇచట శ్రీరంగాన్ని పల్కడం భగవానుడు ఆదరంతో వేంచేసి ఉండే దివ్యదేశాలన్నిటికీ ఉపలక్షణం- అని శ్రీదేశికుల అభిప్రాయం.

ప్రపన్నునకు పూర్వకృత్యమని, ఉత్తరకృత్యమని రెండు ఉన్నాయి. పూర్వ కృత్యాన్నిగూర్చి పూర్వం విస్తృతంగా చెప్పబడింది. ఉత్తరకృత్యం ఇకపై తెలుప బడుతున్నది. ఇదికూడా శ్రీరంగనాథుని సూక్తికి అనువాదం.

**34. శరీరపాతసమయే తు కేవలం మదీయయైవ దయయాஉతిప్రబుద్ధో మామేవావలోకయన్ అప్రచ్యుతపూర్వసంస్కారమనోరథః, జీర్ణమివ వస్త్రం సుఖేనేమాం ప్రకృతిం స్థూలసూక్ష్మరూపాం విసృజ్య, తదానీమేవ మత్ప్రసాదలబ్ధ మచ్చరణారవిన్దయుగళైకాన్తికాత్యన్తిక పరభక్తిపరజ్ఞాన పరమభక్తికృత పరిపూర్ణాన వరత నిత్యవిశదతమానన్యప్రయోజనానవధికాతిశయ ప్రియమదనుభవస్త్వం తథావిధమదనుభవ జనితావధికాతిశయ ప్రీతికారితాశేషావస్థోచితాశేషశేషతైక రతిరూప నిత్యకిఙ్కరో భవిష్యసి॥**

**శరీరపతనసమయే తు** = శరీరం పతనం చెందేటపుడు, **కేవలం మదీయ యైవ దయయా అతిప్రబుద్ధః** = నా సహజమైన కృపతో చాలా గొప్ప జ్ఞానాన్ని కలవారై, **మామ్ ఏవ అవలోకయన్** = దీనికి ముందు చింతించిన నన్నే భావించే వారై, **అప్రచ్యుత పూర్వసంస్కారమనోరథః** = "భగవానుడే నాకు పరమభోగ్య భూతుడు" అనే సంస్కారం, ప్రాప్తిలో కలిగే అభినివేశం తగ్గనివారై (లోపించనివారై), **స్థూలసూక్ష్మరూపామ్ ఇమాం ప్రకృతిం జీర్ణం వస్త్రమివ సుఖేన విసృజ్య** = స్థూలం, సూక్ష్మం అయిన ఈ ప్రకృతిని, జీర్ణమైన వస్త్రాన్ని విడచినట్లు, సులభంగా విడచి, **తదానీమ్ ఏవ** = అపుడే, (ఏ ఆలస్యం లేకుండా),

**మత్ప్రసాద.... భవిష్యసి** = నా అనుగ్రహంవల్లనే నిత్యకైంకర్య సామ్రాజ్యాన్ని పొందినవారుగా కాగలరు. పూర్వం **"పారమార్థిక భగచ్చరణారవిందయుగళై**



**కాంతికాత్యంతిక"** అనే రెండవ చూర్ణిక పల్కిన శ్రీసూక్తులే ఇక్కడకూడా ప్రస్తుతమైనందున దీని వివరణను అక్కడ గమనించవచ్చు.

**35. మా తే భూదత్ర సంశయః ॥**

**మా తేభూదత్ర సంశయః = "నిత్యకింకరో భవిష్యసి"** అని అనుగ్రహించిన ఈ విషయంలో మీకు సంశయం కలుగనక్కర లేదు - అని భావం.

**"ప్రసక్తస్య హి ప్రతిషేధః"** అనికదా న్యాయం. ఇక్కడ సందేహానికి అవకాశం ఉన్నదా?- అని అంటే, లోకంలో క్షుద్రఫలాలను పొందడానికి చాలా ఘనమైన ఉపాయానుష్ఠానాన్ని చేయడం గమనిస్తున్నాము. చాలా గొప్ప ఫలం అయిన మోక్షపురుషార్థాన్ని పొందడానికి - దుష్కరత్వంలో- ఇంతకు మించినది లేదు- అనే రీతిలో పరమదుష్కరమైన ఉపాయం అనుష్ఠించవద్దా ! చాలా సుకరమైన ఈ న్యాసమాత్రంతో ఆ గొప్ప ప్రాప్యం లభిస్తుందా? తప్పక లభిస్తుంది - అని అంటే, అది కేవలం కంటితుడుపుమాట కాదా!- అనే సందేహం కొందఱికి కలుగవచ్చు. కనుక, వారికి తేటపడేటట్లు చేయగోరి, భగవద్రామానుజులను నెపంగా చేసికొని, **"మా తేభూదత్ర సంశయః"** (ఈవిషయంలో నీకు సందేహం వద్దు) అని భగవానుడు పలికాడు.

**36. అనృతం నోక్తపూర్వం మే న చ వక్ష్యే కదాచన ॥**
**రామో ద్విర్నాభిభాషతే ।**
**సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।**
**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ ॥**
**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశు చః ॥**
**ఇతి మయైవ హ్యుక్తమ్ ॥**

**"మా తే భూదత్ర సంశయః"** అని పూర్వం పల్కిన విషయాన్నే తిరిగి స్థిరీక రించడంకోసం ఈ చూర్ణిక, దీని తరువాత చూర్ణిక అవతరించాయి.

నా నిత్యకైంకర్య ప్రాప్తిలో మీకు సందేహం ఉన్నట్లయితే, నేను ఇతఃపూర్వమే పల్కిన మాటకు విరోధిస్తుంది కదా ! అవి అసత్యాలు కాగలవు కదా ! **"తేశుడైయ తేవర్ తిరువరఙ్గచ్చెల్వనార్ పేశి యిరుప్పనకళ్ పేర్క్కవుమ్ పేరావే"** (తేజస్సును కల దేవుడు, శ్రీరంగనాథుడు పల్కిన సూక్తులు అసత్యాలు కానే కావు) అని మీసోదరి (గోదాదేవి) పల్కినది కదా ! కనుక, నా మాటను మీరు ఉపచ్ఛందన

మాత్రంగా గ్రహించ కూడదు- అని శ్రీరంగనాథుడు పల్కిన తీరు ఇది. ఇంతవరకు ఏనాడూ నేను అసత్యాన్ని పలుకలేదు. ఇకపై పలుకబోను- అని శ్రీకృష్ణావతారంలో అన్నాను. శ్రీరాముని నోటిలో రెండు మాటలు రావు- అని శ్రీరామావతారంలో అన్నాను. అంతేకాక, శ్రీరామావతారంలో సముద్రతీరంలో విభీషణాళ్వాన్‌ను వ్యాజంగా చేసికొని "సకృదేవ ప్రపన్నాయ" అనే చరమశ్లోకాన్ని పలికాను. శ్రీకృష్ణావతారంలో అర్జునరథంలో అర్జునుని నెపంగా చేసికొని "సర్వధర్మాన్ పరిత్యజ్య" అనే చరమశ్లోకాన్ని పలికాను. "సకృదేవ" అనే సూక్తిలో "ఏతత్ వ్రతం మమ" అనేది ప్రాణస్థానీయమైన సూక్తి. "సర్వధర్మాన్" అనే శ్లోకంలో "మా శుచః" అనేది ప్రాణస్థానీయమైన వచనం. అందువల్ల ఈవిధంగా పల్కిన నేను దీనికి విరుద్ధంగా ఉండేవాడనుకాను సుమా ! అని దృఢంగా పలికాడు; భగవానుడైన శ్రీరంగనాథుడు.

37. **అత స్త్వం తవ తత్త్వతో మద్జ్ఞానదర్శనప్రాప్తిషు నిస్సంశయ స్సుఖమాస్స్వ ॥**

పూర్వం పల్కిన దానినే దృఢపరుస్తూ పలికే ఈ సూక్తి సంతోషాతిశయం కోసమే. ఇదికూడా భగవద్వాక్యమే.

**అతః** = సత్యవాదిని, సత్యవ్రతుడను అయిన నేను పల్కిన వార్త చాలా విశ్వసించదగినది కనుక, **త్వం** = ప్రామాణికులైన మీరు, **తవ** = నాచే పొందింపబడిన సకలగుణాలను కల్గినవారైన మీయొక్క, **తత్త్వతః మత్ జ్ఞాన దర్శనప్రాప్తిషు**= యథాతథంగా నన్ను తెలిసికోవడం, దర్శించడం, నిత్యకైంకర్యం చేయడం - అనే వీటిలో, **నిస్సంశయః** = ఏ సందేహాన్ని లేనివారై, **సుఖమ్ ఆస్స్వ** = ఆనందంగా ఉండగలరు - భగవానుడు శ్రీరామానుజులను ఉద్దేశించి పల్కినసూక్తి ఇది.

38. **అన్త్యకాలే స్మృతి ర్యాతు తవ కైఙ్కర్యకారితా ।**
**తామేనాం భగవన్! అద్య క్రియమాణాం కురుష్వ మే ॥**

(నీ కైంకర్యాన్ని చేయాలని అంతిమకాలంలో కలిగే స్మృతి ఏది ఉన్నదో, దానిని ఈనాడే నేను చేసేటట్లు అనుగ్రహించు)

**"అంత్యకాలే... కురుష్వ మే"** అనే ఒక శ్లోకం అనుసంధింపబడుతున్నది. పెరియవాచ్చాన్‌పిళ్ళైకాని, శ్రుతప్రకాశికా చార్యుల వారుకాని, నిగమాంత దేశికులు కాని దీనిని వ్యాఖ్యానించలేదు.

శ్రీభగవద్రామానుజవిరచితమైన శరణాగద్యం సంగ్రహ వివరణం సంపూర్ణం.